# నీకు నా లేఖ



రచయిత: త్రిమత ఏకైక గురువు
ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త
శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org





# నీకు నా లేఖ


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (64) చతుష్షష్ఠాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**








ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–37 ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి–2016

ప్రతులు : 1000 **వెల : 60/–**

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.

54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
61) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
62) మరణము తర్వాత జీవితము.
63) ఏ మతములో ఎంత మతద్వేషము?
64) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
65) నీకు నా లేఖ.
66) త్రైతశక పంచాంగము.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ - దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
**70) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**71) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**72) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**73) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**



**భాషలో పాండిత్యమును విడిచి,**
**భావములో పాండిత్యమును చూచువాడు నిజమైన జ్ఞాని.**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక, ఆధ్యాత్మిక ప్రసంగములు

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక, ఆధ్యాత్మిక ప్రసంగములు

***DVD'S***

56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
    కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
    రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
    అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము.
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది.
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. దోబూచులాట.
111. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం,
అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968,
92900 12413, 94406 01136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 8185020272.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి,దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
తెలంగాణ రాష్ట్రం, Cell:94910 40963,
90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా.
Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి టౌన్,
చిత్తూరు జిల్లా.
Cell : 9491773455, 9032903955.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు జిల్లా.
Cell : 9494618322, 8374923363

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘుడియం. పెద్దరెడ్డి** (ప్ర.సభ్యుడు)
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell : 9849883261, 8142853311,
8187084516.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి
(మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ,
మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815,
9440655409, 9701261165.

**యం. మురళి**
క్రొత్త బస్టాండు ప్రక్కన, జడ్చర్ల,
మహబూబ్‌నగర్ జిల్లా.
Cell : 97057 16459

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
సీతానగర్, భువనగిరి టౌన్,
నల్గొండ జిల్లా. Cell : 9948060838
9704885964, 9848141703.

**వి. దుర్గావరప్రసాద్**
భవానీ నగర్, కోదాడ టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9963287001, 9866357001.

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణా ఫార్మా, కాలేజీ రోడ్,
హోస్పేట, బళ్ళారి జిల్లా,
కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

# నీకు నా లేఖ

నీకు నేను లేఖను వ్రాయకముందు లేఖ అంటే ఏమిటి? లేఖను వ్రాసేవాడు ఎవడు? అని తెలిసియుంటే నీకు వచ్చిన లేఖను గురించి నీవు జాగ్రత్తగా చూడగలవు. వ్రాసిన వాని విషయము, లేఖ విషయము రెండూ తెలియకపోతే వచ్చిన లేఖను జాగ్రత్తగా ఎవడూ చదువడు. అందువలన ఎవరికయినా వచ్చిన లేఖ యొక్క విషయమును గురించి తెలిసి యుండ వలెను. వ్రాసిన వాడు ఎవడయినది లేఖలో ఏమున్నదో కొంత తెలిసినప్పుడు లేఖమీద మనోధ్యాస, బుద్ధిశ్రద్ధ రెండూ కలుగును. దేశములోని ఎవరయినా ఎవరికయినా లేఖను వ్రాయవచ్చును. ముఖ్యముగా ఇద్దరి మధ్య సమాచార సంబంధమును కలుగజేయునది లేఖ. ఎవడు ఎవనికయినా ఏ సమాచారమును అయినా వ్రాయవచ్చును. ఒకరికొకరు లేఖను వ్రాయు మనుషులు మారవచ్చును. లేఖలోని సమాచారము మారవచ్చును. అయినా 'లేఖ' అను పేరు మారదు. లేఖను **'ఉత్తరము'**, **'జాబు'** అను రెండు పేర్లతో పిలిచినా 'లేఖ' అనునది ప్రత్యేకమయిన పేరుగా యున్నది.

'లిపి' అనగా వ్రాయబడు అక్షరములని అర్థము. లిపి నుండి 'లిఖితము' అను పదము ఏర్పడినది. లిఖితము అనగా 'వ్రాత' అని అర్థము. లిఖించుట అనగా వ్రాయుట అని అర్థము. లిపి నుండి లిఖి, లిఖి నుండి 'లేఖ' అను పదము పుట్టినది. లేఖ అనగా వ్రాయబడునదని అర్థము. లేఖ అనగా వ్రాయబడునదయినా లేఖలు రెండు రకములుగా ఉన్నాయి. దీనిని గురించి బాగా ఆలోచించిన పెద్దలు లేఖను రెండు రకములుగా విభజించి ఒక రకము దానిని 'జాబు' అనియూ, రెండవ రకము దానిని 'ఉత్తరము' అని పేరు పెట్టడమైనది. పూర్వపు జ్ఞానులయిన వారి ఉద్దేశ్యమును అనుసరించి జాబు అంటే అర్థమేమిటో? ఉత్తరము అంటే ఏమిటో? ఎవరికీ తెలియకుండా పోయినది. తిన్నది కడుపులో కొంతసేపటికి జీర్ణమై పోయినట్లు, ఉన్నది కాలములో కొంత కాలమునకు లేకుండా పోవును.

**తిన్నది కడుపులో కొంతసేపటికి జీర్ణమైపోవును**
**ఇది శరీర ధర్మము.**

**ఉన్నది కాలములో కొంతకాలముకు లేకుండాపోవును**
**ఇది ప్రకృతి ధర్మము.**

జాబు అను పేరును, ఉత్తరము అను పేరును 25 సంవత్సరముల క్రిందట అందరూ వినియేయుందురు. అప్పుడు సమాచారమును చేరవేయు సాధనములలో లేఖలు ముఖ్యమైన పాత్రను పోషించాయి. గడచిన 25 సంవత్సరముల క్రిందట పోస్టాఫీసులు (తపాలా కార్యాలయములు) మనుషులు వ్రాసిన లేఖలను ఒకచోటినుండి మరొకచోటికి చేరవేసెడివి. అప్పుడు ఫోన్ సౌకర్యము లేనందున అందరూ లేఖల ద్వారానే సమాచారమును ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతమునకు పంపెడి వారు. **'ఉన్నది కొంత కాలమునకు లేకుండా పోవును'** అను ప్రకృతి ధర్మము ప్రకారము ఉన్న తపాలా కార్యాలయములకు పని లేకుండా పోయినది. నడుస్తున్న లేఖలు నడువకుండా పోయినవి. నేడు ప్రతి మనిషి దగ్గర ఫోన్ ఉండడము వలన ఎవరికీ లేఖతో పనిలేకుండా పోయినది. వ్రాత రూపమున్న సాక్ష్యము అవసరమైన సందర్భములో మాత్రము తప్పనిసరిగా లేఖను వ్రాయుచున్నారు. తెలుగు భాషలో 'లేఖ' మొదట 'లిపి'నుండి పుట్టుకొచ్చినదని చెప్పుకొన్నాము. ఒకప్పుడు తెలుగుభాష అనేక దేశములలో ప్రపంచ వ్యాప్తముగా ఉండేదని కొన్ని సందర్భములలో మేము చెప్పాము. తెలుగుభాషలో 'లిపి' అను పదమును ఆధారము చేసుకొని ఆంగ్లభాషలో లేఖను 'లెటర్' అని చెప్పుకొంటున్నారు. లిపి నుండి మార్పుచేసి 'లేఖ' అను పదమును మనము వ్రాయగా, ఆంగ్లభాషలో అక్షర రూపములోయున్న లిపిని 'లేఖ' అని మనము చెప్పుకొన్నట్లు చెప్పుకోక లేఖను 'లెటర్' అని

చెప్పుకొన్నారు. లెటర్ అనగా 'అక్షరము' అని అర్థము. లిపి అనగా వ్రాయబడు అక్షరము అని అర్థము. ఆంగ్లేయులు అక్షరములతో వ్రాయు లేఖను అక్షరముల గుర్తుగా 'లెటర్' అన్నారు. అక్షరమును 'లెటర్' అందురు, అట్లే లేఖను కూడా 'లెటర్' అందురు. ఆంగ్లభాషను మొదట వ్రాయునప్పుడే ఈ పొరపాటును వారు చేశారని తెలియుచున్నది. తెలుగులో లిపి, లిఖి, లేఖ అను మూడు మార్పులు రాగా, ఆంగ్లభాషలో 'లెటర్'ను మార్పు చేయకుండా 'లెటర్' అనియే చెప్పారు.

**ప్రశ్న :- తెలుగుభాషలో చెప్పబడు లేఖను జాబు అనియూ, ఉత్తరము అనియూ ఎందుకు రెండు రకముల చెప్పుచున్నారు. అలా చెప్పడములో అర్థమేమయినా కలదా?**

**జవాబు :-** లేఖలో వ్రాయబడిన విషయమునుబట్టి ఆ లేఖను జాబు అనియూ లేక ఉత్తరము అనియూ చెప్పవచ్చును. ఒక ఊరిలో ఇద్దరి మనుషులకు ఒకే రోజు ఒక్కొక్కరికి ఒక్కొక్క లేఖ రావడము జరిగినది. అప్పుడు వారిలో ఒకడు నాకు 'జాబు' వచ్చిందని ఇతరులతో చెప్పగా, రెండవవాడు నాకు 'ఉత్తరము' వచ్చిందని చెప్పాడట. ఈ విధముగా ఇద్దరు రెండు రకముల పేర్లను వచ్చిన లేఖకు చెప్పడమైనది. ఇద్దరికి వచ్చినది లేఖనే అయినా అందులో ఒకటి జాబు, మరొకటి ఉత్తరము ఎలా అయినదో ఇప్పుడు వివరించి చెప్పుకొందాము. లేఖలో లిఖించబడు సమాచారము రెండు రకముల ఉండును. లేఖలో లిఖించబడిన సమాచారమునుబట్టి జాబు లేక ఉత్తరము అని చెప్పడము జరుగుచున్నది. లేఖలో వ్రాయబడిన సమాచారమును చదివిన తర్వాత అది జాబుయో లేక ఉత్తరమో రెండిటిలో ఏదో నిర్ణయించబడును. పూర్వము మనిషి కంటితో చదువగలుగు సమాచారమయినా, లేక చెవితో విను సమాచార

మయినా రెండు రకముల ఉండునని జ్ఞానులు చెప్పెడివారు. జ్ఞానేంద్రియములైన కన్ను, చెవి రెండు ద్వారముల ద్వారా మనిషికి చేరు సమాచారము ఒకటి భుక్తికి అవసరమైనది, రెండు ముక్తికి అవసరమైనది. **భుక్తికి** సంబంధించిన సమాచారముండు దానిని **'జాబు'** అని అంటున్నాము. అలాగే **ముక్తికి** సంబంధించిన సమాచారమున్న దానిని **'ఉత్తరము'** అని చెప్పెడివారు.

ముక్తికి అనగా దైవమును తెలియు సమాచారమయిన దైవ జ్ఞానమున్న దానిని ముక్తికి సంబంధించిన విషయము అనెడివారు. ఒక మనిషి ముక్తిని చేరాలంటే అతని కర్మంతయూ శేషము లేకుండా పోవాలి. శేషము లేకుండా అయిపోవాలంటే కర్మను అనుభవించనయినా అనుభవించాలి లేక అనుభవించను పనికి రాకుండా జ్ఞానముచే కాల్చి వేయాలి. అయిపోవు వరకు అనుభవించాలంటే కొన్ని వందల జన్మలు పట్టేంత కర్మయుండును. అట్లు అనుభవించడములో అజ్ఞానము చేత ఇంకా కొంత కర్మ చేరవచ్చును. ప్రకృతి ధర్మము ప్రకారము ఉన్న జ్ఞానము లేకుండా పోవచ్చును. అందువలన అనుభవించి కర్మను శేషము లేకుండా అయిపోగొట్టుకోవాలనుకోవడము సాధ్యమయ్యేపనికాదు. మనిషి ఏ మతములోయున్నా వాడు ముక్తిని చేరుటకు, దేవుని జ్ఞానము వలననే కర్మను లేకుండా చేసుకొనుటకు అవకాశముండునట్లు చేశాడు. హిందూమతములో యున్నవానికి **"కర్మను జ్ఞానాగ్ని చేత దహించు కోవచ్చును"** అని దైవగ్రంథమయిన భగవద్గీతలో చెప్పడమైనది. **"దేవుడు పాపమును క్షమించును"** అని ద్వితీయ దైవగ్రంథమయిన బైబిలులో చెప్పడమయినది. అలాగే **"దేవుడు క్షమాశీలుడు"** అని అంతిమ దైవగ్రంథ మయిన ఖురాన్‌లో చెప్పడమైనది. మూడు దైవ గ్రంథములలో చెప్పిన మాటలు దైవ వచనములయిన దానివలన అవి తప్పక నెరవేరును.

దేవుని జ్ఞానము ఉన్నతమైనది. జ్ఞానము అగ్నివలె పనిచేసి కర్మను కాల్చుచున్నది. దేవుడుగానీ, దేవుని జ్ఞానముగానీ శరీరములో ఉన్నతమైన స్థానమున అనగా శరీరము పై భాగమున శిరస్సుయందు కలదని పెద్దలు చెప్పుచుందురు. జ్ఞాన మూలమంతయూ పైన తలయందు గలదని చెప్పుచూ భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున మొదటి శ్లోకములోనే **"ఊర్థ్వమూల"** అని చెప్పారు. చెట్టుకు మూలము క్రిందయున్నట్లు, మనిషికి మూలము పైనకలదని అక్కడ చెప్పారు. **'ఊర్థ్వ'** అను శబ్దము నుండి **'ఉత్తర'** అను శబ్దము పుట్టినది. ఊర్థ్వ అనగా పైనయని చెప్పినట్లు, ఉత్తర అనగా పైన అని చెప్పినట్లు, ఉత్తర దిశ భూమికి పైన కలదు. శరీరములోని ప్రతి సమాచారము శరీరముపైనగల తలకు చేరునట్లు, భూమికి దక్షిణ దిశలోనుండి ఉత్తర దిశకు గురుత్వాకర్షణ శక్తి ప్రాకుచున్నది. భారత దేశము క్రిందివైపు దక్షిణము కాగా, పై భాగము ఉత్తర దిశలో ఉన్నది. **ఉత్తర దిశ** అనగా **'జ్ఞానదిశ'** అని అర్థము గలదు. ఎందుకనగా! మనిషి శిరస్సులో యున్న జ్ఞానము పై భాగమున ఉండుట వలన, దేశమునకు ఉత్తరము పై భాగమున ఉండుట వలన, విశ్వములో గురుత్వాకర్షణ శక్తి దక్షిణము నుండి ఉత్తరమునకే పోవుచుండుట వలన, ఉత్తర దిశ జ్ఞాన సంబంధమైనదని చెప్పవచ్చును. పూర్వము మనిషి చనిపోతే ఊరికి ఉత్తరమున స్మశానము ఏర్పరచి ఉత్తర దిశలోయున్న స్మశానములో పూడ్చి పెట్టెడివారు. ఈ విధముగా ఉత్తర దిశ జ్ఞానమార్గములో ఒక ప్రత్యేకతను సంపాదించుకొన్నది.

ఉత్తర దిశ జ్ఞానములో ప్రత్యేకత కల్గియుండుట వలన, దైవ సంబంధమైన జ్ఞానమునుగానీ, జ్ఞానమున్న ఏ సమాచారమును గానీ **"ఉత్తరము"** అను పేరు పెట్టి పిలిచెడివారు. ఇప్పుడు అసలు విషయానికి వస్తే లేఖలో దైవజ్ఞాన సంబంధ సమాచారము ఉంటే దానిని ఉత్తరము

అనెడివారు. లేఖను ఎవరు వ్రాసినా, ఎవరికి వ్రాసినా, అందులో సమాచారము జ్ఞానవంతమైనదైతే ఆ లేఖను 'ఉత్తరము' అని చెప్పెడివారు. అందువలన ఇద్దరిలో ఒకనికి వచ్చిన లేఖలో దైవ సంబంధ జ్ఞాన విషయములుండుట వలన వాడు నాకు ఉత్తరము వచ్చిందని ఆ లేఖను గురించి చెప్పాడు. ఈ విధముగా లేఖకు 'ఉత్తరము' అను పేరు వచ్చినది.

వ్రాయబడు లేఖలోనున్న సమాచారము దైవజ్ఞానమునకు సంబంధించినదే ఉండక ప్రపంచ సంబంధ సమాచారమునకు సంబంధించి కూడా ఉండవచ్చును. ప్రపంచములో వ్రాయబడు లేఖలన్నీ ప్రపంచ సంబంధ సమాచారముగలవియే యుండును. ప్రపంచ సంబంధ సమాచార ముండు లేఖను 'జాబు' అని అంటున్నారు. జాబుకు కూడా అర్థము కలదు. **'జా'** అనగా **'పుట్టడమని'** భావము కలదు. **'బు'** అనగా **'చావడము'** అని అర్థము గలదు. పుట్టడములో మనిషి శరీరము పుట్టి కనిపించుచున్నది. మరణముతో మనిషి శరీరము కనిపించకపోవును. మనిషి తల్లి గర్భము నుండి పుట్టుచున్నాడు. తర్వాత కొంతకాలము జీవించి మరణించడము జరుగుచున్నది. మరణములో శరీరమును భూమిలో పూడ్చిపెట్టడమో లేక అగ్నిలో బుగ్గిచేయడమో జరుగుచున్నది. **'పూడ్చిపెట్టడము'** అను మాటను **'బూడ్చిపెట్టడము'** అని కూడా కొందరు అనుచుందురు. శరీరమును బూడ్చి పెట్టడముగానీ, బుగ్గిపాలు చేయుట గానీ మరణములోనే జరుగును. ఒక మనిషి పుట్టడము, చావడము సాధారణముగా జరుగు ప్రపంచ సంబంధమైన విషయమే. అజ్ఞానములో యున్న మనిషి పుట్టడము, చావడము జరుగుచుండును. జ్ఞానములోయున్న మనిషి పుట్టుక, చావు నుండి బయట పడి మోక్షమును పొందును. అజ్ఞానములోని మనిషి చావుపుట్టుకలు పొందుచుండును. కనుక పుట్టుకకు గుర్తుగా 'జా' అనియూ,

మరణమునకు గుర్తుగా 'ఖు' అనియూ రెండు అక్షరములను కలిపి ప్రపంచ సంబంధ అజ్ఞాన సమాచారమున్న లేఖను 'జాబు' అని అనెడివారు. లేఖలో దైవ సంబంధ జ్ఞాన సమాచారముంటే దానిని **'ఉత్తరము'** అనియూ, ప్రపంచ సంబంధ సమాచారముంటే దానిని **'జాబు'** అనియూ చెప్పెడివారు.

**లేఖ** ——
- **జాబు - ప్రపంచ సంబంధమైనది.**
- **ఉత్తరము - పరమాత్మ సంబంధమైనది.**

ప్రశ్న :- **ప్రపంచ సంబంధమైన సమాచారమున్న గ్రంథమును జాబు అనవచ్చును కదా! అట్లే దైవసంబంధమైన సమాచారమున్న గ్రంథమును ఉత్తరము అని అనవచ్చును కదా!**

**జవాబు :-** సమాచారమునుబట్టి జాబు, ఉత్తరము అనవచ్చును. వ్రాయబడే సమాచారమును లేఖ అంటున్నాము. లిఖించబడునది కావున లేఖ అను పేరుతో చెప్పుచున్నాము. అయితే వ్రాయబడిన లేఖ పెద్దది కావచ్చును, చిన్నది కావచ్చును. లేఖ ఒక కాగితములోనే వ్రాయబడి యుండవచ్చును. లేక కొన్ని కాగితములు కలిసిన గ్రంథముగా కూడా వ్రాయవచ్చును. అందువలన లేఖ అనునది అనగా జాబుగానీ, ఉత్తరముగానీ ఒక కాగితము కావచ్చును లేక ఒక గ్రంథము కావచ్చును.

సమాచారము చిన్నదయితే చిన్న కాగితములో వ్రాయవచ్చును. సమాచారము పెద్దదయితే ఒక గ్రంథరూపములో వ్రాయవచ్చును. ప్రపంచములో అందరూ వ్రాయునవి జాబులే ఉండును గానీ, కొద్దిమంది వ్రాయునవి మాత్రము ఉత్తరములుగా ఉండును. త్రైత సిద్ధాంత జ్ఞానము తెలిసిన వారు ఎవరైనా జాబులు వ్రాయరు. ఉత్తరములే వ్రాయుదురు.

**ప్రశ్న :- మీరు వ్రాసిన వాటిలో ఎక్కువ ఏవి యున్నాయి. జాబులా, ఉత్తరములా?**

**జవాబు :-** మేము వ్రాసిన 73 గ్రంథములన్నియూ ఉత్తరములేగానీ, జాబు ఒక్కటి కూడా లేదు. మా ఉత్తరములన్నియూ చిన్నగ ఏవీ లేవు. అన్నీ కొన్ని పేపర్ల సముదాయమైన గ్రంథములుగాయున్నవి.

**ప్రశ్న :- మీరు లిపిని ఉపయోగించి గ్రంథములు వ్రాశారు కదా! లిపిని ఉపయోగించి వ్రాయబడినది లేఖ అయినప్పుడు లేఖను వ్రాసిన వాడు లేఖరి అగును కదా! అటువంటప్పుడు మిమ్ములను గ్రంథకర్త అని అనకుండా 'లేఖరి' అని అనవచ్చును కదా!**

**జవాబు :-** 'లేఖరి' అని అనడములో తప్పులేదు. అయితే వ్రాయబడిన విషయము అందరివలె కాకుండా ప్రత్యేకతను సంతరించుకొనియుంటే అటువంటి లేఖను వ్రాసిన వానిని సాధారణ లేఖరి అనకుండా 'విలేఖరి' అని అనవలెను. విలేఖరి అనగా విశేషమైన సమాచారమును వ్రాసినవాడని అర్థము. మేము వ్రాసిన ప్రతి గ్రంథము ఒక విశేషత కల్గియుండును కనుక మా గ్రంథములను **విలేఖరి** గ్రంథములనవచ్చును.

**ప్రశ్న :- సాధారణ వార్తలను వార్తాపత్రికలకు వ్రాసి ఇచ్చు వారిని విలేఖరులని అనుచుండుటను విన్నాము. ఇప్పుడు మీరు చెప్పు భావము ప్రకారమైతే వార్తాపత్రికలకు వార్తలు వ్రాయువారు విలేఖరులే కాదని చెప్పాలి. అయితే వార్తాపత్రికలకు వార్తలను వ్రాయువారిని ఏమనాలి?**

**జవాబు :-** వారు పత్రికలకు సమాచారమును వ్రాయువారు కావున వారిని 'లేఖరులు' అని అనవచ్చును. ఎప్పుడయినా వారు విశేషమైన సమాచారమును వ్రాసి ఇస్తే, అప్పుడు వారు అప్పటికి అనగా ఆ

సమాచారమునకు మాత్రము విలేఖరులగుదురు. అంతేగానీ వారు శాశ్వతముగా విలేఖరులుగారు. వ్రాయబడిన సమాచారమునుబట్టి వారు లేఖరా? విలేఖరా అను పేరు రాగలదు. అందువలన ఎవడూ ప్రతి సమాచారములోనూ విలేఖరి కాలేడు. అట్లే ప్రతి విషయములోను లేఖరి కూడా కాలేడు.

**ప్రశ్న :- మీరు మీ గ్రంథముల మీద రచయిత పేరు క్రింద "సంచలనాత్మక రచయిత" అని పేరు పెట్టుకొన్నారు. ప్రతి విషయము, ప్రతి గ్రంథము సంచలనాత్మకమైనదే అయితే మిమ్ములను విలేఖరి అనియే అనవచ్చును కదా! మీ ప్రతి గ్రంథము విశేషతతో కూడుకొన్నదైనప్పుడు, మిమ్ములను శాశ్వతముగా "విలేఖరి" అని అనవచ్చును కదా!**

**జవాబు :-** ఎవరంతకు వారు 'విలేఖరి' అని పెట్టుకోవడములో ప్రత్యేకత ఏమీ లేదు. అది వ్రాసిన విషయమును చదివినవారు విశేషతను గుర్తించి ఇతరులు పెట్టు బిరుదులాంటిదేగానీ, ఎవరంతకు వారు పెట్టుకోవడము గొప్పతనము కాదు. మేము వ్రాసిన గ్రంథములలోని ప్రత్యేకతను విశేషతను గుర్తించిన వారు మమ్ములను లేఖరులనో, విలేఖరులనో నిర్ధారించి చెప్పవచ్చును. విలేఖరి అనునది ఇతరుల చేత చెప్పబడునదేగానీ, తనకు తాను చెప్పుకొనునది కాదు.

**ప్రశ్న :- ద్వాపర యుగములో కృష్ణుడు భగవద్గీతను చెప్పాడు. దానిని వ్యాసుడు వ్రాశాడు. భగవద్గీత విశేషమైన జ్ఞానము గలది. కావున భగవద్గీతను చెప్పిన కృష్ణున్ని, వ్రాసిన వ్యాసున్ని ఇద్దరినీ కలిపి చూస్తే ఎవరు భగవదీగ్తకు గ్రంథకర్త, ఎవరు 'విలేఖరి' అను పేరుకు యోగ్యులు?**

**జవాబు :-** ఇంటికి ప్లాన్‌వేసిన ఇంజనీర్‌యే ముఖ్యముగానీ, ఇల్లు కట్టిన

వాడు ముఖ్యముకాదు. ఇంజనీర్ వ్రాసిన నమూనా ప్రకారమే ఇల్లు కట్టబడును. అందువలన ఇల్లు కట్టినవాని ప్రత్యేకత అందులో ఏమీ ఉండదు. అలాగే భగవద్గీతను జ్ఞానముతో కూర్చి చెప్పిన కృష్ణుడే ముఖ్యము గానీ, చెప్పిన దానిని వ్రాసినవాడు ముఖ్యము కాదు. చెప్పిన వానికంటే వ్రాసిన వాడు ముఖ్యము అంటే, వ్రాసిన వానికంటే పేపరు మీద వ్రాసిన పెన్ను ముఖ్యము కాగలదు. ఏ విధముగా చూచినా భగవద్గీత యొక్క విలేఖరి కృష్ణుడే కాగలడు. లేఖరి అనగా వ్రాసినవాడు కదా! అటువంటప్పుడు కృష్ణుడు వ్రాయలేదు కదా! అని ప్రశ్న కొందరికి రావచ్చును. ఎప్పుడు చెప్పబడిందో అప్పుడే వ్రాయకున్నా వ్రాసిన దానితో సమానమైపోతున్నది. అందువలన తర్వాత వ్రాసిన వానికంటే మొదట చెప్పిన వాడే ముఖ్యము, అతనే విలేఖరి.

**ప్రశ్న :- భగవద్గీత గ్రంథరూపములో వ్రాయబడినది. మొదట సంస్కృతములో వ్రాయబడినది. దానిని కృష్ణుడు చెప్పినప్పుడు అది విలేఖగా, విశేషత కల్గిన ఉత్తరముగా ఉండవచ్చును. తర్వాత ఎందరో పండితులనబడువారు మిగతా భాషలలో లిఖించారు. తెలుగులోనికి వ్రాసిన భగవద్గీతయందు కృష్ణుని భావము ఏమాత్రము లేకుండా పోయినది. కేవలము అప్పుడు తెలుగులో చదివిన వారికి అందులోని విశేషత ఏమీ లేనట్లు తెలియుచున్నది. ఆ విధముగా భగవద్గీత కృష్ణుని భావమునకు దూరముగా వ్రాయబడినది. అప్పుడు దానిని ఏమనాలి? విశేషత లేని దానివలన కేవలము 'లేఖ' అని చెప్పాలా? లేక 'విలేఖ' అని చెప్పాలా?**

**జవాబు :-** భగవద్గీత ఏ భాషలో వ్రాయబడినా భగవద్గీత శ్లోకములు మాత్రము సంస్కృత భాషలోనే యుండును. సంస్కృత శ్లోకము వ్రాసి తర్వాత దానికి తెలుగులో భావము వ్రాసియుందురు. సంస్కృత శ్లోకములు

ఉండుట వలన  అందులో కృష్ణుని భావమున్నట్లేయగును.  తర్వాత వ్రాసిన తెలుగు భావములు సరిగా లేకపోతే  అందులో విశేషత లేకుండా పోవును. అది తెలుగులో వ్రాసిన గ్రంథకర్తకు సంబంధించినదగును.  అప్పుడు తెలుగు భగవద్గీతను మాత్రమే విశేషత లేనిదిగా చెప్పవచ్చును.  దానిని లేఖ అనియే చెప్పాలి.  తెలుగులో వ్రాసిన భగవద్గీతయందు సంస్కృత శ్లోకములుండుట వలన  అందులో కృష్ణుని నిజ భావము ఉండుట వలన దానిని విశేషత యున్న దానిగా లెక్కించవచ్చును.  తెలుగులో వ్రాయబడిన దానిని విశేషత లేనిదానిగా చెప్పవచ్చును.  ఇట్లు ఒక తెలుగు అనువాద భగవద్గీతలో రెండు భావములున్న భగవద్గీత సంస్కృతములో, తెలుగులో యుండుట వలన  దానిని రెండు రకములుగా విశేషత యున్న విలేఖగా, విశేషత లేని లేఖగా చెప్పవచ్చును.

**ప్రశ్న :- భార్య దూరప్రాంతములోయున్న భర్తకు ప్రేమతో లేఖ వ్రాసింది. అందులో తమ సంసారమునకు సంబంధించిన సమాచారమును, తమ పిల్లల చదువు విషయమును, దానికి తోడు కొన్ని ఆర్థిక ఇబ్బందులను వ్రాయడమైనది.  ఐదారు విషయములను ఆ లేఖలో వ్రాయడమైనది. అప్పుడు ఆ లేఖను ఏమనాలి? అది జాబు అగునా? లేక ఉత్తరమగునా?**

**జవాబు :-** ప్రేమతో వ్రాసినది, పైగా సంసార విషయములతో కూడుకొన్నది. అర్థిక ఇబ్బందుల విషయము కూడా యున్నది.  అంతకుమించి అందులో ఏమీ లేదు.  ఆ లేఖలో ప్రపంచ విషయములు తప్ప  దైవికమయిన విషయములు ఏమాత్రము లేవు. అందువలన సూత్రము ప్రకారము ఆ లేఖను ముమ్మాటికీ జాబు అనవచ్చునుగానీ, ఉత్తరము అనుటకు ఏమాత్రము వీలు లేదు.

**ప్రశ్న :- ఒక స్నేహితుడు మరొక స్నేహితునికి వ్రాసిన లేఖలో కొంత ప్రపంచ విషయముండగా, కొంత దైవజ్ఞానము కూడా కలదు. అప్పుడు దానిని ఏమనాలి?**

**జవాబు :-** ప్రపంచ సంబంధ విషయము, పరమాత్మ సంబంధ విషయములు రెండూ లేఖలో యున్నప్పుడు ఏది ఎక్కువ, ఏది తక్కువయున్నదో లెక్కించి చూడవలెను. అప్పుడు ఏ విషయము ఎక్కువ యుండునో ఆ విషయము సంబంధముగా ఆ లేఖను గుర్తించవలెను. అందులో దైవసంబంధ విషయములే ఎక్కువగాయున్నట్లయితే దానిని ఉత్తరముగా చెప్పవలెను. ఒకవేళ ప్రపంచ సంబంధ విషయములు ఎక్కువున్నట్లయితే దానిని జాబు క్రిందికి జమకట్టవలెను.

**ప్రశ్న :- ఇంతవరకు మీరు చెప్పిన సమాచారమునుబట్టి వ్రాయబడిన సమాచారము ఏదయినా అది లేఖ క్రిందికే జమకట్టబడును. వ్రాయబడిన సమాచారము చిన్న కాగితములో యున్నా, పెద్ద గ్రంథములోయున్నా వ్రాసిన సమాచారమునుబట్టి అది జాబు క్రిందికో లేక ఉత్తరము క్రిందికో జమకట్టబడును. ఇప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ తన కూతురయిన ఇందిరా గాంధీకి వ్రాసిన లేఖను చూచి, దానిని జాబు అనవచ్చునా లేక ఉత్తరము అనవచ్చునా మీరే చెప్పండి?**

**జవాబు :-** ఈ లేఖ పైకి ప్రపంచ విషయమును బోధించునట్లు కనిపించినా, మనిషిని ఉన్నత స్థితికి పంపు సమాచారములాగ యున్నది. ఇది పూర్తి దేవుని విషయము కాకున్నా భవిష్యత్తులో దైవమార్గమువైపు చూపు మళ్ళించు లాగున ఉండుట వలన ఈ లేఖను 'జాబు' అనకుండా 'ఉత్తరము' అనడమే మంచిది. ఈ విధముగా కొన్ని సందిగ్ధ సమాచారములను చూచి అది

## ప్రముఖుల లేఖ



*సాక్షిన్యూస్ పేపరు 21-01-2014*

# ఇందు దేశమే ఇండియా!

హిమాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి

భవిష్యత్తులో దేనివైపుకు పోవునట్లు చేయగలదో దానినిబట్టి వాటిని జాబుగనో, ఉత్తరముగనో నిర్ణయించవచ్చును.

**ప్రశ్న :- ఒక రాజకీయ నాయకునికి, అనగా ఒక మంత్రి పదవిని పొంది అధికారములో యున్న వ్యక్తికి మీరు లేఖను వ్రాస్తే ఏ పద్ధతిలో వ్రాయగలరు? జాబుగా వ్రాయగలరా? ఉత్తరముగా వ్రాయగలరా?**

**జవాబు :-** నేను లేఖ వ్రాస్తే ఉత్తరముగా వ్రాయగలను. జాబుగా వ్రాయవలసిన అవసరము ఏమాత్రముండదు. మేము ఉన్న స్థితినిబట్టి ఎదుటి వ్యక్తికి లేఖ వ్రాయడము ఉంటుంది. నేను లేఖను వ్రాయబోయే వ్యక్తి నాకంటే గొప్పవాడయితే అతనికి నేను భయపడుచూ, అతనిని గౌరవిస్తూ, లేఖను వ్రాయవలసి వస్తుంది. కొన్ని విషయములను చెప్పేటప్పుడు వినయ పూర్వకముగా చెప్పవలసియుండును. ఏదయినా చేయవలసినది చెప్పవలసియుంటే బ్రతిమిలాడినట్లు ఎంతో వినయముతో చెప్పవలసియుంటుంది. ఏమాట చెప్పినా ప్రాధేయపడి చెప్పినట్లుండును. ఏదయినా స్వంత భావమును చెప్పవలసి వచ్చినా, నా మాట కాదన్నట్లు ఇతరుల మాటయన్నట్లు సవరించి చెప్పవలసియుంటుంది.

**ప్రశ్న :- రాజకీయ నాయకులు మీకంటే గొప్పవారే కదా! వారికి మీ మాటలు సరిపోవునా?**

**జావాబు :-** ఏ విషయమునయినా 'మేము ఒప్పుకుంటేనే', 'మీరు చెప్పితేనే' అను భావమును వదలివేయండి. మేము చెప్పినది ఇతరులకు నచ్చవచ్చును, నచ్చకపోవచ్చును. 'మా మాటయే ముఖ్యము' అను ఉద్దేశ్యముతో మేము చెప్పడము లేదు. ఏదయినా బ్రహ్మవిద్యాశాస్త్ర పద్ధతిని అనుసరించి మేము చెప్పుదుము. శాస్త్రపద్ధతి ప్రకారము నడువాలనుకున్న వారికి మాత్రము

మా మాటలు పనికి వచ్చును. శాస్త్రపద్ధతిని అనుసరించని వారికి మా మాటలు వర్తించవు.

**ప్రశ్న :- దేశములో ఎందరో ప్రజలు ఎన్నో రంగములలో పని చేయుచున్నారు. వారివారి ఆసక్తినిబట్టి వారు ఆయారంగములలో పని చేయుచుందురు. దేశములో ఎన్నో రంగములు గలవు. అన్ని రంగముల కంటే గొప్పది రాజకీయమని చెప్పుచుందురు. ప్రపంచములో మనిషి బ్రతికే దానికి ఎన్నో రంగములున్నా వాటిలో అత్యంత విలువైనది రాజకీయమని చాలామంది రాజకీయమును ఆశ్రయించుచుందురు. మీరు అన్నిటికంటే గొప్పదైన దానియందున్నానని చెప్పుచుందురు. అయితే మీరు రాజకీయము లో లేకుండా ఆధ్యాత్మికములో యున్నారు కదా! అన్నిటికంటే రాజకీయము గొప్పదని మీరు కూడా చెప్పడము మేము విన్నాము. అటువంటప్పుడు మీరు రాజకీయములో లేనప్పుడు, ఆధ్యాత్మికములో యున్నప్పుడు మీరు ఆధ్యాత్మికములో యుంటూ మేము గొప్ప రంగములోయున్నామనడము సరియైన మాట కాదు కదా!**

**జవాబు :-** నీవు అడిగే ప్రశ్నలన్నీ ముక్కులో వెంట్రుకను పట్టి లాగినట్లు, మూతిమీద మీసము పట్టుకొని గుంజినట్లు ఉంటాయి. ముక్కుసూటిగా అడుగు నీ ప్రశ్నలకు నాలుక సూటిగా జవాబును చెప్పక తప్పదు. రాజకీయము గొప్పదని నేను అనేకమార్లు చెప్పడము వాస్తవమే. నేను అన్నిటికంటే పెద్ద రంగమయిన ఆధ్యాత్మిక రంగములో యున్నానని చెప్పడము కూడా వాస్తవమే. అయితే ఆధ్యాత్మికము రాజకీయమును రెండిటిని చూచిన మీరు పొరపాటు పడిపోయి పై ప్రశ్నను అడిగారనుకుంటున్నాను. వాస్తవము చెప్పాలంటే నేడు మీరు రాజకీయమని దేనిని అనుకుంటున్నారో అది రాజకీయము కాదు. రాజకీయమును గురించి వివరముగా చెప్పుకొంటే

అది ఇదికాదు అని తెలియగలదు. రాజకీయమును విడదీసి చూస్తే రాజ+కీయము=రాజకీయము అని రెండు పదముల కలయికగా రాజకీయము కలదు. **'కీయము'** అను పదము **'క్రియ'** అను శబ్దమునుండి పుట్టినది. క్రియ అనగా పని లేక కార్యము అని అర్థము. మనిషి చేత చేయబడు కార్యమును కీయము అంటున్నాము. మనిషి ఎన్ని పనులు చేసినా ఆ పనులలో మంచి చెడు అను రెండు రకముల పనులుండును. వాటినే గొప్ప పనులనియూ, గొప్ప కాని తక్కువ పనులనియూ రెండు రకముల విభజింపబడియుండును. గొప్ప పనులను **రాజ** అనియూ, తక్కువ పనులను **నీచ** అనియూ చెప్పుచుందురు. అందరికంటే గొప్ప 'రాజు' కనుక గొప్ప కార్యమును **రాజకీయము** అంటున్నాము. విలువలేని, గొప్పకాని పనులను **నీచకీయము** అంటున్నాము. రాజకీయమునకు వ్యతిరేఖ పదము నీచకీయము అంటున్నాము. భూమిమీద రాజకీయము ఏది అని తెలియని మనుషులు, ప్రజలను పాలించు ప్రభుత్వ విధానమైన పనులను రాజకీయము అని అనుకొంటున్నారు. దేశములో ప్రభుత్వ విధానమే రాజకీయమైతే ఆధ్యాత్మికము దానికంటే చిన్నదైపోవును. వాస్తవానికి భగవద్గీతలో దేవుడు భగవంతునిగా చెప్పిన మాటనుబట్టి చూస్తే మనము ఇపుడు రాజకీయమని దేనిని అనుకొంటున్నామో అది రాజకీయము కాదు. భగవద్గీతలోని బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము **ఆధ్యాత్మికమే నిజమైన రాజకీయము.** భగవద్గీతలో ప్రత్యేకించి ఒక అధ్యాయము పేరు రాజవిద్యా, రాజగుహ్యా యోగము అని కలదు. రాజ అంటే అన్నిటికంటే పెద్దయని అర్థము. అన్నిటికంటే పెద్దవిద్య అని ఆధ్యాత్మిక విద్యనే అనుచుండుట వలన దానిని **'రాజవిద్య'** అని అన్నారు. అలాగే **'రాజగుహ్య'** అనగా పెద్ద రహస్యము అని అర్థము. రహస్యములలో పెద్ద

రహస్యమయిన ఆధ్యాత్మికమును (దైవ జ్ఞానమును) చెప్పునప్పుడు భగవంతుడు రాజగుహ్యా అను పదమును ఉపయోగించాడు. దీనిప్రకారము ప్రపంచములో ఆధ్యాత్మికమైన దేవుని జ్ఞానమే అన్నిటికంటే గొప్పదియని తెలియుచున్నది. జ్ఞానముకంటే పరిపాలన విధానము నీచకీయమైనది.

బయట ప్రపంచములో ప్రభుత్వపాలనా విధాన కార్యములను రాజకీయము అనడము అందరికి అలవాటై పోయినది. దేవుడు బ్రహ్మవిద్యా శాస్త్రములో చెప్పిన దానిప్రకారము **దైవజ్ఞానమును తెలిసి దాని ప్రకారము ఆచరించు యోగకార్యములే రాజకీయములు.** పూర్వము ప్రజలలో రాజులయిన వారివద్దకు అనగా పరిపాలన చేయు రాజువద్దకు జ్ఞానులయిన మహర్షులు వచ్చెడి వారు. రాజులే మహర్షులను ఆహ్వానించి పిలిచెడి వారు. మహర్షులు వారికి తీరికయిన సమయములో రాజులవద్దకు వచ్చెడి వారు. ఆ సమయములో రాజు తన సింహాసనమున కూర్చొని యున్ననూ మహర్షులను చూచిన వెంటనే లేచి మహర్షులకు ఎదురుపోయి నమస్కరించి, గౌరవపూర్వకముగా ఆహ్వానము పలికి, వారిని పిలుచుకొని వచ్చి తన సింహాసనమున కూర్చోబెట్టెడివారు. ఆ దృశ్యమును చూస్తే వచ్చిన మహర్షి రాజుకంటే ఎంతో గొప్పవాడు అన్నట్లు తెలియును. అంతటితో ఆగక రాజు స్వయముగా మహర్షి పాదములను కడిగి, ఆ నీరును తలమీద చల్లుకొనుట చేయుచుందురు. పాదములను పట్టి నమస్కరించడము, పాదములను కడిగి నీరు చల్లుకోవడము, తన సింహాసనమును మహర్షికి ఇవ్వడమును చూస్తే రాజుకంటే మహర్షి ఎన్నోరెట్లు గొప్పయని తెలియ గలదు.

ఇదంతయూ ప్రత్యక్షముగా చూచిన తర్వాత రాజు చేయు ప్రభుత్వ విధాన కార్యములకంటే, ఒక దైవజ్ఞాని చేయు దేవుని విధానమైన యోగ కార్యములే గొప్పయని తెలియుచున్నది. దైవ ధర్మములను తన కార్యములలో అమలు చేయడము **యోగము** అంటాము. అలా అమలు చేయు యోగ కార్యములు గొప్పవైనందున వాటిని రాజకీయము అని అన్నారు. మనిషి మనుషులను పాలించడముకంటే మనిషి దైవధర్మములను ఆచరించడము చాలాగొప్ప. అందువలన **జ్ఞాని చేయు పనులను నిజమైన రాజకీయము** అని చెప్ప వచ్చును. వాస్తవముగా రాజకీయము దైవజ్ఞానమును ఆచరించు జ్ఞానుల వద్దనే యుండుట వలన, భూమిని పాలించు రాజులు సహితము జ్ఞానులను నమస్కరించుచున్నారు మరియు గౌరవించుచున్నారు. ఈ లెక్క ప్రకారము జ్ఞానులదే నిజమైన రాజకీయమైనప్పుడు భూపాలకులయిన రాజులను అనగా ప్రస్తుతము ప్రభుత్వములో నాయకులుగా, మంత్రులుగా, రాష్ట్రపతులుగా ముఖ్యమంత్రులుగా, ప్రధాన మంత్రులుగా యుండి ప్రజలను పాలించు కార్యములను చేయు ప్రజా నాయకులది రాజకీయము కాకపోతే వారు చేయు పనులను ఏమనాలి? వారిని ఏమనాలి? అను ప్రశ్న రాగలదు. దానికి సమాధానము ఈ విధముగా గలదు.

నేడుగానీ పూర్వముగానీ పాలనా విధానమును చేపట్టు వారిని రాజులనడము పరిపాటియై పోయినది. కృతయుగములో ప్రజలను పాలించు వారిని రాజులు అనెడివారు కాదు. ఒక శిశువుకు తల్లి ఎన్నో సేవలు చేసి ఆలనా, పాలనా చేయడము చూస్తున్నాము. అలాగే ఒక వ్యక్తి ప్రజల ఆలనా, పాలనా చేయడము జరుగుచున్నది. తల్లిబిడ్డలకు అన్ని విధములా సేవ చేసి శిశువుకు కావలసిన సదుపాయములను కల్పించినట్లు, ప్రజలను తన బిడ్డలవలె చూస్తూ ప్రజలకు కావలసిన సదుపాయములను కలుగజేసి,

వారి ఆలనా పాలనా సక్రమముగా చూచు వ్యక్తిని తమ పాలకుడుగా ప్రజలు చెప్పుకొనెడివారు. బిడ్డలకు తల్లి ఎలా సేవ చేయుచున్నదో అలాగే ఒక పాలకుడు తన ప్రజలకు సేవ చేయుట వలన అతనిని 'ప్రజా సేవకుడు' అనెడివారు. పూర్వము ప్రజా సేవకులుగా ఎందరో కాలము గడిపిపోయారు. కొంత కాలము జరుగగా ప్రజలకు సేవ చేయువారు తమను సేవకుడుగా కాకుండా, రాజుగా చెప్పుకోవడము జరిగినది. అలా రాజుగా చెప్పకొన్న తర్వాత రాజుగా యున్నవాడు ప్రజల సేవ చేయడము మానివేసి, ప్రజల చేత సేవ చేయించుకొనుటకు మొదలు పెట్టారు. దానికంటే పూర్వము సేవకులుగా యున్నవారు ప్రజల క్షేమము కొరకు పాటుపడెడి వారు. ప్రజా సేవకులుగా యున్నవారు ప్రజలకు రాజులుగా తయారయిన తర్వాత ప్రజలకు సేవ చేయడము మానివేసి ప్రజల చేత సేవ చేయించుకొనుటకు పూనుకొన్నారు.

తల్లి తన బిడ్డలను ఎంతో ప్రేమతో చూచుకొనుటను మానివేసి తన మాట వినని బిడ్డలను చిత్రహింసలు పెట్టి చంపివేసిందనుకో! అప్పుడు ఆమెను తల్లి అనము. ఆ బిడ్డల పాలిట రాక్షసి అంటాము. అలాగే ప్రజలకు సేవ చేస్తానని ముందుకు వచ్చి ప్రజల పాలనా కర్తవ్యములో ప్రజల ఆలనా పాలనా చూడకుండా, ప్రజలను ఏమాత్రము పట్టించు కోకుండా తనకు ఎదురు తిరిగిన వారిని, తనకు వ్యతిరేఖముగా మాట్లాడిన వారిని హింసలకు గురిచేసి, జైళ్ళలో వేసి బాధించువారు అవకాశముంటే చంపివేయువారుయుంటే వారిని ప్రజాసేవకులనుటకు బదులు ప్రజా భక్షకులనాలి. రాక్షసులుగా చెప్పాలి.

నేడు ప్రజాపాలనా విధానములో జరుగునది ప్రజల సేవ కాదు. ప్రజలతో సేవ చేయించుకోవడము, వారిమాట వినని వారిని, వారికి

వ్యతిరేఖముగా యున్నవారిని కేసులలో ఇరికించి పోలీసులతో వేధించడము, ఆర్థికముగా దెబ్బతీయడము జరుగుచున్నది. తమ మాటనే ప్రజలు వినాలి అనువారు నేడు ప్రజాసేవకుల ముసుగులో పాలనా విధానములో యున్నారు. పాలనా విధానములో తొంభైమంది ప్రజాపీడితులుండి కేవలము పదిమంది ప్రజాసేవకులున్నా, వారిని కూడా నమ్మలేక అందరితో పాటు వారిని కూడా ప్రజాపీడితులుగానే అనుమానించవలసి వచ్చుచున్నది. మొత్తము మీద ఆధ్యాత్మికము రాజులాంటిది. ప్రజాపాలనా విధానము ఆధ్యాత్మికము కంటే అన్ని విధముల తక్కువది. కావున ఆధ్యాత్మికమును 'రాజకీయము' అన్నారు. ప్రజాపాలనను 'నీచకీయము' అన్నారు. రాజకీయమునకు నీచకీయము గౌరవించెడిది. అనగా ప్రజాపాలకులు యోగులను గౌరవించెడి వారు. రాజుకంటే సేనాధిపతి తక్కువవాడే అగుట వలన తక్కువను నీచ అనీ, గొప్పను ఉచ్ఛ అనీ చెప్పడము పరిపాటి అగుట వలన ఆధ్యాత్మికము ప్రక్కలో ప్రజాపాలన తక్కువదగుట వలన ప్రజాపాలనను నీచకీయము అనియూ, ఆధ్యాత్మికమును రాజకీయము అనియూ చెప్పబడినది. అట్లనుట వలన ప్రజాపాలన అన్నిటికంటే నీచమయినదని అనుకోకూడదు. ఆధ్యాత్మికము ప్రక్కలో ఆధ్యాత్మికముకంటే నీచమయినదని మాత్రమే చెప్పుచున్నాము. ప్రజాపాలన మిగతా రంగములతో పోల్చి చూచితే వాటికంటే ఉచ్ఛమయినదేగానీ, నీచమయినది కాదని చెప్పవచ్చును. దొంగతనముతో ప్రజాపాలనా విధానమును పోల్చి చూచితే దొంగతనము నీచకీయమైనదగును. అట్లే మిగతా అన్ని రంగముల కార్యములు ప్రజాపాలన ప్రక్కన నీచముగానే అనగా తక్కువగానే ఉండును. అందువలన మిగతావాటికంటే పాలనా విధానము రాజకీయముగా ఉండును.

నేడు భూమిమీద ఆధ్యాత్మికము ఏమాత్రము కనిపించకుండా పోయిన దానివలన, ప్రజాపాలనే ఎక్కువ అయిపోయిన దానివలన,

అన్నిటికంటే గొప్పది పాలనా విధానమే అన్నట్లు, పాలనా విధానమునే నేడు అందరూ 'రాజకీయము' అంటున్నారు. నేడు ఆధ్యాత్మికము ఎక్కడయినా అరుదుగా ఉన్నట్లు కనిపించినా అది సరియైన పద్ధతితో లేనిదానివలన, అది విలువలేనిదై పోయినది. ఎక్కడయినా శాస్త్రపద్ధతిలో ఆధ్యాత్మికమున్నా దాని విలువను తెలియని మనుజులుండుట వలన, దానిని ఎవరూ గొప్పగా తలువక పోవడము వలన, అందరికీ ప్రజాపాలన మీదనే దృష్టి గౌరవముండుట వలన, నేటికాలములో అన్నిటికంటే పెద్దగా యున్న ప్రజాపాలనా విధానమే రాజకీయముగా చెప్పబడుచున్నది. ఏది ఏమయినా కొద్దిమంది దృష్టిలో ఆధ్యాత్మికము నేటికీ గౌరవ ప్రథముగా యున్నది. దైవజ్ఞానము యొక్క విలువ తెలిసిన ఎవడైనాగానీ, ఆధ్యాత్మికమునే రాజకీయముగా చెప్పక తప్పదు. అందువలన అంతో ఇంతో జ్ఞానము తెలిసిన మేము పాలనా విధానముకంటే ఆధ్యాత్మిక విధానము గొప్పదని తెలిసి, **ఆధ్యాత్మికమునే రాజకీయము** అంటున్నాము. ఆధ్యాత్మికముకంటే ప్రజాపాలనా విధానము తక్కువయినదగుట వలన దానిని **'నీచకీయము'** అని అంటున్నాము.

**ప్రశ్న :- దేశములో ఎన్ని విద్యలు గలవు? అన్ని విద్యలకంటే పెద్దవిద్య ఏది?**

**జవాబు :-** కొందరు పెద్దలు చతుష్షష్ఠి (64) విద్యలు గలవని అంటుంటారు. ఇంకా కొందరు "కూటికొరకు కోటి విద్యలు" అని కూడా అంటుంటారు. వాస్తవానికి విద్యలు 64 మాత్రమే కలవని ఒక విధానము ప్రకారము చెప్పవచ్చును. 'కూటికొరకు కోటి విద్యలు' అనుమాట సత్యము కాకపోవచ్చును. కూటి కొరకు కోటి కార్యములున్నవిగానీ, విద్యలు లేవు. ఒకే విద్యను నేర్చినవాడు ఆ విద్యలో ఎన్ని పనులనయినా చేయవచ్చును.

ఉదాహరణకు చోరవిద్య నేర్చినవాడు ఆ విద్యను ఆసరాగా ఎన్ని రకములయిన దొంగతనములయినా చేయవచ్చును. వివిధ రకముల దొంగతనములు వేరువేరు కార్యములుగాయుండును, కనుక దొంగతనమే అనేక కార్యములుగా కనిపించుచున్నది. రాత్రిపూట ఇంటికి రంధ్రము వేసి దొంగతనము చేసెడివారు. అది ఒక పనితో కూడుకొనిన దొంగతనము కాగా, మరియొక దొంగ జేబుదొంగతనమును చేసెడివాడు. జేబు దొంగతనము ఇంటి దొంగతనముకంటే ప్రత్యేకత కల్గియుండుట వలన ఆ పనికంటే ఈ పని వేరుగాయున్నది. ఇట్లు ఒకే దొంగవిద్యలో ఎన్నో రకముల దొంగతనములు ఎన్నో రకముల పనులతో కూడుకొనియుండుట వలన ఒకే విద్య ఎన్నో పనులకు కారణమగుచున్నది. దాని వలన విద్యలు 64 మాత్రమే యున్నా వాటికి సంబంధించిన కార్యములు మొత్తము కోటి యుండవచ్చును. అందువలన కూటి కొరకు కోటి కార్యములన వచ్చును. 64 విద్యలు ఐదు శాస్త్రములకు సంబంధించినవి మాత్రమే గలవు. ఆరవ శాస్త్రమైన బ్రహ్మవిద్యా శాస్త్రము అన్ని శాస్త్రములకంటే గొప్పది. 64 విద్యలు కోటి పనులుగాయున్నా బ్రహ్మ విద్య ఒక్కదానియందు మాత్రము మూడు రకములయిన పనులు కలవు. ఆ మూడు కార్యములను మూడు యోగములుగా చెప్పుచున్నాము. **కర్మయోగము, బ్రహ్మయోగము, భక్తి యోగము** అను మూడు యోగములు మూడు వేరువేరు క్రియలుగా యున్నవి. బ్రహ్మవిద్య మూడు క్రియా యోగములుగా ఆచరించబడుచున్నది.

**ప్రశ్న :- ప్రస్తుతము భూమిమీద గల మనుషులలో ఎక్కువ శాతము ఏ కార్యములను చేయుచున్నారు?**

**జవాబు :-** నేడు భూమిమీద గల మనుషులలో ఐదు శాస్త్రములకు సంబంధించిన 64 విద్యలలోనే మునిగి తేలుచున్నారు. బ్రహ్మవిద్యను

ఎవరయినా అనుసరిస్తున్నారని తెలిసినా, అక్కడికి పోయి చూస్తే వారు 'బ్రహ్మవిద్య' అను పేరుపెట్టి ప్రపంచ విద్యలనే ఆచరిస్తున్నారని తెలియు చున్నది. ఈ విధముగా మొత్తానికి మనుషులందరూ ప్రపంచ విద్యలనే అనుసరిస్తున్నారు తప్ప బ్రహ్మవిద్యను ఎవరూ అనుసరించడము లేదు, ఆచరించడము లేదు. బ్రహ్మవిద్య అంటే ఏమిటో తెలియని స్థితిలో మనుషులున్నారు. మనము ఆచరించు 64 విద్యలకంటే గొప్పది, పెద్దది, శక్తివంతమైనది, అన్నిటికంటే వేరయినది, ప్రత్యేకమయిన బ్రహ్మవిద్య ఒకటున్నదనీ, ఆ విద్యలో మూడు విధముల కార్యాచరణలు గలవనీ, వాటినే కర్మ, బ్రహ్మ, భక్తియోగ క్రియలని చెప్పుచున్నామను విషయమును ప్రజలు పూర్తిగా మరచిపోయారు. బ్రహ్మవిద్యను పూర్తిగా తెలియని స్థితిలో మనుషులున్నారు.

**ప్రశ్న :- నేడు భూమిమీద మనుషులలోనే కొందరు ప్రత్యేకమయిన వ్యక్తులు హంసలనీ, పరమహంసలనీ, యోగులనీ, హఠ యోగులనీ, జ్ఞానులనీ, చైతన్య జ్ఞానులనీ, మహర్షులనీ, సిద్ధులనీ, గురువులనీ, బోధకులనీ స్వాములు, బాబాలనీ అనేక విధమైన పేర్లతో చలామణి అగుచున్నారు. వారందరూ దైవజ్ఞానములో ఆరితేరినవారని ఇన్ని విధముల పేర్లతో చెప్పబడుచున్నారు. అటువంటి వారిని గొప్ప వ్యక్తులుగా మిగతా ప్రజలందరూ గౌరవించుచున్నారు. ఇటువంటి సమయములో బ్రహ్మవిద్యను తెలిసినవారు లేరని చెప్పడములో మీ ఉద్దేశ్యమేమిటి?**

**జవాబు :-** నేడు భూమిమీద గల ఇన్ని విధముల పేర్లతో పిలువబడు వారుండుట నిజమే! సామాన్య ప్రజలు వారిని గౌరవించి వారిని గొప్పగా పొగడడము కూడా వాస్తవమే! ఇదంతయూ ఒక్క హిందూమతము లోనే గలదు. ఇంతమంది గురువులు స్వామీజీలున్న సమాజములో

మేమున్నందుకు చిన్నవయస్సులో మేము సంతోషించెడివారము. తర్వాత కాలము జరుగుచూపోగా, మా వయస్సు పెరుగుతూ రాగా, బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారమైతే అందరినీ సృష్ఠించిన దేవున్ని తప్ప మిగతా దేవతలను దైవజ్ఞానము తెలిసిన వారు ఎవరూ మ్రొక్కరని తెలిసినది. అప్పుడు పైన చెప్పబడిన జ్ఞానులందరూ ఏదో ఒక దేవున్నో, దేవతనో మ్రొక్కడము అసలయిన దేవున్ని తలచకపోవడము చూస్తే, వారి పేరుకు తగినంత జ్ఞానము వారిలో లేదని తెలిసిపోయినది. అప్పుడు వారిని మేము దైవజ్ఞానమును తెలిసిన జ్ఞానులుగా కాకుండా సాధారణ మనుషులుగా గుర్తించడము జరిగినది. **"అసలయిన దేవున్నిగానీ, దేవుని జ్ఞానమును గానీ గుర్తించినవాడు ఇతర దేవతలను మ్రొక్కడు"** అను ఒకే ఒక సూత్రమును అనుసరించి అనేక పేర్లతో చలామణి అగువారందరూ నిజమైన బ్రహ్మవిద్యను తెలిసినవారు కాదని తెలిసిపోయినది. వారందరూ గొప్ప వ్యక్తులుగా, గౌరవింపబడు స్వామీజీలుగా గుర్తించబడినా, వాస్తవముగా వారికి బ్రహ్మవిద్య తెలియని దానివలన వారిని జ్ఞానులుగా మేము గుర్తించడము లేదు.

ఉదాహరణకు ఒక విషయమును గురించి చెప్పుకొంటే ఇలా కలదు. ఒక స్వామీజీ అనిపించుకొన్న గొప్ప వ్యక్తి బ్రహ్మవిద్యను బాగా తెలిసినవాడిగా మాకు కనిపించెడివాడు. అతడు బ్రహ్మవిద్యా శాస్త్రమునకు సంబంధించిన ఎన్నో సూత్రములు గల భగవద్గీతను ఉపన్యాస రూపములో ఒక నెలరోజులు ప్రజలకు బోధించాడు. ఎంతో గొప్పగా నెలరోజులు భగవద్గీతను బోధించిన వ్యక్తిని తప్పనిసరిగా బ్రహ్మవిద్యను తెలిసిన వాడుగా భావించాము. మిగతా ప్రజలు కూడా అలాగే గొప్పగా భావించారు. ఎంతోమందికి గొప్ప జ్ఞానిగా కనిపించిన వ్యక్తిని మేము కూడా గొప్పగా

తలచెడివారము. అంతపెద్ద స్వామీజీ ఒక దినము ఉదయమే దేవతాగుడికి పోయి ఆ దేవతను పూజించిరావడము, దేవత పేరు ఉచ్ఛరించుచూ గుడిచుట్టూ ప్రదక్షిణలు చేయడము మేము ప్రత్యక్షముగా చూచాము. అప్పుడు ఆ స్వామీజీ ప్రజల లెక్కలో స్వామీజీ అయినా మా లెక్కలో అతను సాధారణ మనిషిగానే ఉన్నట్లు తెలిసినది. ఇట్లు ఎందరో గొప్ప స్వాములు సహితము బ్రహ్మవిద్యను సరిగా అర్థము చేసుకోలేకపోవు చున్నారని తెలియుచున్నది. ఈ విధముగా గొప్ప పేర్లు పెట్టుకొన్నవారందరూ నిజమైన దైవజ్ఞానమును తెలియని స్థితిలో యున్నారని, వారు చేయు పూజలనుబట్టి వారు వారి పేరుకు తగినట్లు లేరని అర్థమగుచున్నది.

**ప్రశ్న :- సమాజములో స్వామీజీలుగా పేరుగాంచిన వారే సరియైన మార్గములో లేనట్లు మీకు తెలిసినది కదా! అటువంటప్పుడు మిగతా ప్రజానీకము దైవమార్గమును వదలి నడుస్తున్నారని చెప్పవచ్చును కదా! దైవమార్గమును వదలి నడుచువారు తమ దారి సరియైనది కాదను ధ్యాస లేకుండా పోవుచుందురు. అటువంటి వారికి జ్ఞానమును తెలియునట్లు చేయడము దైవకార్యమగును. అదే దైవసేవ కూడా అగును. జ్ఞానము తెలియనివారు వారికి తెలిసిన ప్రపంచ విద్యలలోనే కాలము గడుపుచూ, వారు చేయు పనులనే ఉన్నతమైన పనులుగా భావించుచుందురు. అటువంటి వారికి సత్యమును తెలిపి, వారిని దైవమార్గములోనికి పంపుటకు మీరు ఎలా కృషి చేయగలరు?**

జవాబు :- **దేవున్ని ప్రార్థించడముకంటే, దేవున్ని ఆరాధించడము కంటే ఉన్నతమైనది దేవుని సేవ.** దేవుని సేవ అనగా! దేవుని జ్ఞానమును ఇతరులకు తెలియజేయడము. దేవుడు కనిపించడు, కావున ఆయన సేవ

జ్ఞానమును ప్రచారము చేయడము వలననే జరుగును. నేను దేవుని సేవ చేయవలెననునది నా ముఖ్య ఉద్దేశ్యము. నేను దేవుని సేవ చేయడము వలన జ్ఞానము తెలియనివారికి జ్ఞానమును తెలిపి సరియైన మార్గములోనికి తెచ్చినట్లగును. అందువలన నేను ఇతరులకు జ్ఞానమును తెలుపు కార్యమునే చేయదలచుకొన్నాను. జ్ఞానమును బయటి ప్రపంచములోని ప్రజలకు రెండు విధముల చెప్పవచ్చును. ఒకటి చెప్పే బోధ వలన, రెండు వ్రాసే వ్రాతవలన సమాచారమును బయటికి పంపవచ్చును. అందులో చెప్పేబోధ తాత్కాలికమగును. వ్రాసే గ్రంథము శాశ్వతముగా ఉండును. బోధ, గ్రంథము రెండు దేవుని జ్ఞానమును తెలుపునవే అయినా బోధ వేగముగా, తొందరగా మనుషులలోనికి ప్రాకగలదు. గ్రంథరూపమైన వ్రాత ఆలస్యముగా ప్రజల లోనికి చేరగలదు. తొందరగా ప్రాకు బోధ, ఆలస్యముగా చేరు వ్రాత రెండిటి ద్వారా ప్రజలకు జ్ఞానమును తెలియజేయాలనుకొన్నాము.

నేనున్న శరీరములోని అధిపతి (ఈశ్వరుడు) తన శక్తిని రెండు రకములుగా శరీరములో ప్రాకునట్లు చేయుచున్నాడు. శరీరములోపల అధిపతి ఒక్కడే గలడు. శరీరములన్నిటికీ అధిపతి ఒక్కడే. అయితే శరీరములకు, శరీరములు కాని సమస్త ప్రపంచమునకు అధిపతి దేవుడు ఒక్కడే గలడు. దేవుడు సమస్తమును సృష్ఠించినవాడు. ఆయనను ఒక్కనినే 'సృష్ఠికర్త' అని అనగలము. **శరీరములోపల గల అధిపతి దేవుని తర్వాత దేవునిగా, అధిపతి తర్వాత అధిపతిగా, ఈశ్వరుని తర్వాత ఈశ్వరునిగా చెప్పబడుచున్నాడు.** శరీరములోని ఈశ్వరుడుగా, శరీరమునందుగల అధికారిగా ఎవడయితే ఉన్నాడో అతనిని **"ఆత్మ"** అని అంటున్నాము. ఆత్మ అనగా తెలియబడక అణిగియున్నదని అర్థము. శరీరములో అణిగిపోయి ఎవరికీ తెలియని ఆత్మ తనశక్తిని శరీరములో రెండు మార్గముల ద్వారా

ప్రసరింపజేయుచున్నది. ఆత్మకు రెండు రకముల శక్తులు గలవు. ఒకటి కదలించు చైతన్యశక్తి, రెండు ఏమాత్రము కనిపించకుండా ప్రేరేపించు ప్రేరణాశక్తి.

శరీరములో ఈ రెండు శక్తులు శరీరమంతా ప్రాకుటకు తన శరీరములోనూ రెండు వ్యాపకములను దేవుడు నిర్మించాడు. శరీరము మీద గల తలనుండి శరీరము యొక్క గుదస్థానము వరకు ప్రాకియున్న పెద్ద నరము (బ్రహ్మనాడి) ద్వారా ఒక వ్యాపకమును, శరీరములోనే కాళ్ళు చేతులను వదలి మిగతా శరీరములో తలనుండి క్రిందివరకు అక్కడక్కడ నిర్మింపబడియున్న గ్రంథులు మరొక వ్యాపకముగా యున్నవి. రెండు వ్యాపకముల ద్వారా రెండు శక్తులు శరీరములో వ్యాపించియున్నవి. రెండు శక్తులు ఒకే ఆత్మవయినా ఒక శక్తి కదలికలతో కూడుకొన్న చైతన్యశక్తి, రెండవది కదలికలు లేని ప్రేరణాశక్తి. చైతన్యశక్తి వెన్నెముకలోని పెద్ద నరముయందుగల ఏడు నాడీకేంద్రముల ద్వారా శరీరములోనికి ప్రాకుచున్నది. అలాగే శరీరములో అక్కడక్కడ గల ఏడు గ్రంథులనుండి ప్రేరణాశక్తి శరీరములో ప్రవేశించుచున్నది. ఇదంతయూ ప్రతి మనిషిలో జరుగుచున్న విధానము.

**ప్రశ్న :- మధ్యలో మాట్లాడుచున్నందుకు క్షమించండి! నేను అడిగిన ప్రశ్న ఒకటి కాగా, మీరు చెప్పు జవాబు మరొకటిగాయున్నది. దయచేసి మేము అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పండి.**

**జవాబు :-** నీవు అడిగిన ప్రశ్నకే జవాబు చెప్పుచున్నాను. జవాబు అర్థము కావాలంటే ముందుగా చెప్పవలసిన దానిని చెప్పుచున్నాను. ఒక సినిమాకు ముందు ఆ సినిమా వీరివలననే తయారయినదని తెలియజేయు వివరణ వ్రాతరూపములో ప్రదర్శిస్తారు. అట్లే భోజనము తినాలంటే ముందు

కాళ్ళు చేతులు కడుక్కోవాలి. అలాగే నేను ప్రజలకు జ్ఞానసేవ చేయాలంటే శరీరముతోనే చేయాలి. శరీరము నాది అని చేయక, శరీరము నాది కాదు అని ముందే చెప్పి, సేవ చేయడము ముఖ్యము. అందువలన జవాబుకు ముందు కొంత ఉపోద్ఘాతము తప్పక చెప్పవలసి వచ్చినది. నీకు ఇష్టముండి వింటే జ్ఞానము అర్థము కాగలదు. ఒకవేళ ఇష్టము లేకుండా వినకపోతే జ్ఞానము అపార్థమై పోయి నీకు లభించకపోవును.

మేము తాత్కాలముగా చెప్పు జ్ఞానబోధ శరీరములోని ఏడు చైతన్య కేంద్రములనుండి రావలసిందే. అలాగే మేము వ్రాయు సమాచార జ్ఞానము ఏడు గ్రంథుల ద్వారా ప్రేరణయై రావలసిందే. ఈ రెండు విధానములు మీకు ముందే తెలియుట వలన వినే బోధమీద, చదివే వ్రాతమీద శ్రద్ధ తప్పక రాగలదు. అందువలన ఈ విషయమును ముందే చెప్పుచున్నాము. శరీరములో ఏడు నాడీకేంద్రముల ద్వారా, ఏడు గ్రంథుల ద్వారా శరీరమంతా వ్యాపించియున్న ఆత్మ తన నాడీకేంద్రములనుండి జ్ఞానమును బోధగా చెప్పించును. అలాగే తన గ్రంథులనుండి జ్ఞానమును గ్రంథముగా వ్రాయించును. ఆత్మ చెప్పించినదే బోధ, ఆత్మ వ్రాయించినదే గ్రంథము. నేడు నేను ప్రజలకు జ్ఞానమును బోధ ద్వారా, గ్రంథముల ద్వారా రెండు విధముల తెలియజేసి దైవసేవ చేయాలనుకొన్నాను. అదే విషయమును తెలియజేయు నిమిత్తము శరీరములో ఉన్న తతంగమును తెలియజేశాను. ముందుగా ఈ విషయమును తెలియజేయడము వలన చదివేటప్పుడు **గ్రంథుల శక్తి,** వినేటప్పుడు **నాడీకేంద్రముల శక్తి** గుర్తుకు రాగలదు.

వివరముగా తెలియుటకు ఇంకొక విషయమును చెప్పుచున్నాను వినండి. ప్రతి ఊరిలోనూ పోస్టాఫీసు ఉండడము మనము చూచియే యుందుము. సెల్‌ఫోన్ రాకపూర్వము, దాదాపు 40 సంవత్సరముల

క్రిందట పోస్టాఫీసు అందరికీ అవసరముగా ఉండెడిది. ఏ సమాచారము నయినా పోస్టుద్వారా పంపెడివారము. సెల్‌ఫోన్‌లు వచ్చిన తర్వాత పోస్టాఫీసు పని తగ్గిపోయినది. పోస్టాఫీసు అంటే తెలియని స్థితి ఏర్పడినది. పోస్టు ఆఫీస్‌ను తెలుగులో తంతి, తపాలా ఆఫీసు అనెడివారు. ఇంగ్లీషు భాషలో పోస్టు అండ్ టెలిగ్రాఫ్ ఆఫీసు అని అనెడివారు. దానినే పోస్టును 'తపాలా' అనియూ, టెలిగ్రాఫ్‌ను 'తంతి' అనెడివారు. వ్రాత రూపములో వ్రాయు జాబులను లేక ఉత్తరములను 'తపాలా' అని అనెడివారు. వేగముగా చేరు సమాచారమైన టెలిగ్రాఫ్ లేక టెలిఫోన్ సమాచారమును 'తంతి' అనియూ, ఆలస్యముగా చేరు సమాచారమయిన లేఖ రూపములో (జాబు రూపములో) వ్రాయబడిన సమాచారమును 'తపాలా' అనియూ చెప్పెడి వారు. బయట పెట్టిన పేర్లు కూడా శరీరములో యున్న జ్ఞానమును అనుసరించి పెట్టినవేనని తెలియుచున్నది. వేగముగా సమాచారము మాటల రూపములో బయటికి రాగలదని చెప్పాము. వేగముగా వచ్చు సమాచారము శరీరములోని పొడవాటి నాడుల ద్వారా, అందులోని కేంద్రముల ద్వారా బయటికి వచ్చుచున్నది. బయట కూడా పొడవాటి తీగ ద్వారా వచ్చు సమాచారమును 'తంతి' అన్నారు. శరీరములోని నాడి లేక నరము కూడా తీగలాగయుండును. శరీరములో సమాచారము వేగముగా బయటికి వస్తున్నదను నమూనాను తెలియజేయు నిమిత్తమే టెలిగ్రామ్ లేక టెలిఫోన్ సమాచారము తీగద్వారా వచ్చునట్లు దేవుడు నిర్మించాడని అర్థమగుచున్నది.

ఒక ఊరిలో తంతి, తపాలా ఆఫీసుయున్నట్లు, శరీరములోనే తంతి మరియు తపాలా ఆఫీసు కలదని చెప్పవచ్చును. తంతి ఆఫీసు నరముల వ్యవస్థ, తపాలా ఆఫీసు గ్రంథుల వ్యవస్థ రెండూ శరీరములోనే కలవని తెలియుచున్నది. నేనున్న శరీరములో తంతి తపాలా ఆఫీసు అన్నిటికంటే పెద్దగాయున్నది. నేను పోస్టుమ్యాన్‌గా పనిచేస్తూ మీకు వచ్చిన తపాలా

మరియు తంతి (పోస్టు మరియు టెలిగ్రామ్) సమాచారమును అందించు చున్నాను. ఏ జాబునుగానీ, ఏ ఉత్తరమునుగానీ పోస్టుమ్యాన్ వ్రాయడు. **"పోస్టుమ్యాన్"** వచ్చిన సమాచారమును అందించు మధ్యవర్తి మాత్రమే. అలాగే నేను చెప్పు బోధ గానీ, వ్రాయు వ్రాతగానీ నాదికాదు, తంతి, తపాలా (నాడులనుండి, గ్రంథులనుండి వచ్చు) సమాచారమేనని తెలియ వలెను. ఇప్పుడు నా వలన మీకు వచ్చు ఏ సమాచారము నాది కాదనీ, అది నా శరీరములోని తంతి, తపాలాఫీసునుండి వచ్చినదని మీరు కూడా తెలియ గలరు.

నేను నా ఆఫీసునుండి వచ్చు (నా శరీరములోని ఆత్మనుండి వచ్చు) సమాచారమును మాత్రము రెండు రకములుగా తెలియజేయుచున్నాను. నేను అందించు సమాచారము పోస్టు (గ్రంథ రూపముగా) మరియు టెలిగ్రామ్ (మాట రూపముగా) యుండును. ఈ రెండు రూపములలో ప్రజలకు జ్ఞాన సమాచారమును అందించి వారిని జ్ఞానులుగా మార్చుచూ, దైవసేవ చేయాలని అనగా పోస్టుమ్యాన్ ఉద్యోగమును చేయాలని అనుకొన్నాను. ప్రతి నెలలో గల పౌర్ణమి దినమున వచ్చు తంతిని అనగా మాటల రూపములో వచ్చు సమాచారమును ప్రజలకు ఉపన్యాస రూపములో అందించుచున్నాను. అలాగే కొన్ని నెలలకొకమారు తపాలా (గ్రంథముల) రూపములో జ్ఞానమును అందించుచున్నాము. ఈ విధముగా మా దగ్గరకు వచ్చు వారికి మాత్రమే, మేము అందుబాటులో యున్నవారికి మాత్రమే, సమాచారమును అందించుచున్నామను మాట రాకుండా, అన్ని రంగము లలో పనిచేయుచున్న అందరికీ మేము ప్రత్యేకముగా లేఖ వ్రాసి వారిని జాగృత పరచునట్లు ప్రయత్నము చేయాలనుకొన్నాము. ఆ ప్రయత్నములో భాగముగా అందరికి తపాలా రూపములో సమాచారమును పంపుచున్నాము.

వ్రాతరూపములో వ్రాయబడు వ్రాతను 'లేఖ' అంటాము. అన్ని రంగములలో పనిచేయు అందరికీ లేఖలను వ్రాయదలచాము. మనుషులు అది, ఇది అనకుండా 64 విద్యలలోని కోట్లాది కోట్లు పనులు చేయు అందరికీ జ్ఞాన సమచారమందునట్లు చేయాలనుకొని కార్మికులకు, కర్షకులకు, బోధకులకు, గురువులకు, వ్యాపారులకు, ఉద్యోగస్తులకు, పోలీసులకు, దొంగలకు, ఆఫీసర్‌లకు, గుమస్తాలకు, తెలివైనవారికి, తెలివితక్కువ వారికి, సంసారికి, వ్యభిచారికి, ధనికునికి, పేదవానికి, రాజకీయములోని వానికి, నీచకీయములోని వారికి, మంత్రికి, రాజుకు, అధికారహోదా యున్నవారికి, ఏ హోదా లేనివానికి, మాయకునికి, గుత్రము కలవానికి, సమస్త మానవులకు తెలియునట్లు తపాలా ద్వారా వచ్చు సమాచారమును అనగా లేఖ రూపములో సమాచారమును తెలియజేయ గలను. ఒక రాజకీయ నాయకునికి నానుండి ఒక ఉత్తరము వచ్చిందంటే ఆ సమాచారమును అతనికొక్కనికే కాకుండా మిగతా రాజకీయనాయకు లందరికీ అని తెలియవలసియుండును. అట్లే కర్షకునికి (రైతుకు) మేము లేఖ వ్రాస్తే, అది కర్షకులందరికీ చెప్పిన సమాచారముగా తెలియవలెను. ఇదే విధముగా ఒక కార్మికునికి లేఖ వ్రాస్తే అది కార్మికులందరికీ వర్తించునని తెలియవలెను.

లిపితో లిఖించబడిన లేఖ అందరిదీ జాబు అయినా, నాది మాత్రము ఉత్తరముగా ఉండవలెనని శరీరములోని అధిపతి (ఈశ్వరుడు) యైన ఆత్మను కోరుచూ జీవాత్మనయిన నా భావముతో ఆత్మను లేఖ వ్రాయమని కోరుచున్నాను. వ్రాయునది ఆత్మయే, జీవాత్మనయిన నేను వ్రాయలేను. అయితే నా భావముతో ఆత్మ వ్రాసినా లేక చేసినా అది నేను వ్రాసినట్లే, నేను చేసినట్లేయగును. అప్పుడు నేను దేవుని సేవ చేసినట్లగును. అందువలన

ఇక్కడ ఆత్మ పని చేయుచున్నా, నా యొక్క అహం భావముండుట వలన ఈ పనిని నేను చేసినట్లేయగును. ఆ సేవా ఫలితము నాకే దక్కును. ఇక్కడ దైవసేవ నిమిత్తము లేఖను ఉత్తరముగా వ్రాయుచున్నాము. మొదటి లేఖ మనుషులలో ఎక్కువ పేదవాడయిన దరిద్రునికి వ్రాయుచున్నాము. పేదవానిని 'దరిద్రుడు' అనడము జరుగుచున్నది, కావున నేను మొదట దరిద్రునికే ఉత్తర రూపములో లేఖను వ్రాయ దలచుకొన్నాను.

**ప్రశ్న :- పేదవానిని పేదవాడు అంటే సరిపోతుంది కదా! దరిద్రుడు అని హేళన చేసినట్లు ఎందుకు చెప్పాలి? జ్ఞానము తెలిసిన మీరే నిరుపేదను దరిద్రుడు అని నీచముగా ఉచ్ఛరించక నిర్భాగ్యుడు అనిగానీ నిరుపేద అనిగానీ చెప్పవచ్చును కదా!**

**జవాబు :-** నీవు ఈ మాటను అడుగవలెననే నేను పేదవాడిని 'దరిద్రుడు' అని చెప్పాను. దేనినయినా సందర్భములేకుండా చెప్పలేము కదా! ఇప్పుడు నీవు అడిగావు, కావున నేను చెప్పేదానికి సందర్భము దొరికింది. ఇది నీకు చెప్పే ఉత్తరము అని అనుకో. ధనవంతుడు అనగా ధనము కలవాడు అని అర్థము. అలాగే భగవంతుడు అనగా భగము కలవాడు అని చెప్పలేము. అక్కడ భగమునుండి పుట్టినవాడు అని చెప్పవలెను. హిందీభాషలో దవాఖానా అనగా మందులు తినిపించే వైద్యశాల అని అర్థము. అలాగే పాయఖానా అని అంటే ఇక్కడ కూడా ఏదో తినిపించేది అని అనుకోకూడదు. మలవిసర్జనశాల అనుకోవలెను. ఈ విధముగా సమయమునుబట్టి, సందర్భమును బట్టి, వ్యక్తపరిచే స్థలమునుబట్టి, వ్యక్తులనుబట్టి పదములకు అర్థములు మారుచుండును. ఇప్పుడు నేను 'దరిద్రుడు' అను పదమును చెప్పిన వెంటనే ఆ పదమును నీచముగా, హేళనగా చెప్పినట్లు మీరు అనుకొన్నారు. ఇప్పుడు అలా అనుకొనే సందర్భమే కాదని తెలుపుచున్నాము.

నేను మొదటనే నా ద్వారా వచ్చు సమాచారమంతయూ ఉత్తరముగా ఉండవలెనని ఆత్మను వేడుకొన్నాను. అందువలన మిమ్ములను **"దేవుని దరిదాపులకు"** తీసుకొని పోవునట్లే మాట్లాడవలెనని అనుకొన్నాను. అందువలన నేను **'దరిద్రుడు'** అను పదమును వాడడము జరిగినది. వెంటనే దానిని గురించి నీవు ప్రశ్నించడమైనది. ఆ మాట యొక్క విధానమును గురించి ఇప్పుడు చెప్పుకొందాము.

'దరి' అనగా గట్టు అని అర్థము. 'దాపు' అనగా దగ్గర అని అర్థము. 'దరిదాపు' అనగా గట్టుకు దగ్గరగా అని అర్థము. దేవుని దరిదాపుకు అనగా దేవుని గట్టు సమీపమునకు అని భావము. అదే విధముగా దరి అను పదమును ఉపయోగించి దరిద్రుడు అని అన్నాము. **'దరిద్రుడు'** అనగా **'దేవుని జ్ఞానము అను గట్టుకు దగ్గరగాయున్నవాడు'** అని అర్థము. 'ద్రుడు' అనగా దృఢముగా యున్నవాడని అర్థము. గట్టు దగ్గర గట్టిగాయున్న వానిని దరిద్రుడు అని చెప్పవచ్చును. ధనము కల్గినవానిని ధనవంతుడు అనవచ్చును. ధనము అనగా ఇక్కడ ప్రపంచ ధనమని అర్థము. ప్రపంచ ధనము కల్గినవానికి దైవజ్ఞానము చాలా దూరముగాయుండునని చెప్పవచ్చును. ఈ విషయమును మధ్యదైవగ్రంథమందు ఇలా చెప్పి యున్నారు. **(మత్తయి సువార్త.19-23,24) "ధనవంతుడు పరలోక రాజ్యములో ప్రవేశించుట దుర్లభమని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. ధనవంతుడు పరలోక రాజ్యములో ప్రవేశించుటకంటే సూదిబెజ్జములో ఒంటె దూరుట సులభమని చెప్పుచున్నాను".** ధనమున్న వారు సహజముగా దేవుని జ్ఞానమునకు దూరముగా ఉందురు. సర్వము ధనము వలననే జరుగునను నమ్మకముతో వారుందురు. ధనమున్నవారు అరుదుగా దైవ జ్ఞానము మీద ఆసక్తి కల్గియుందురు.

పేదవాని విషయమునకు వచ్చి చూస్తే వానికి అన్నీ కష్టములే కలుగుచుండుట వలన వానికి తొందరగా దైవజ్ఞానము అర్థము కాగలదు. మనిషికి బాధలలోనే దేవుడు, దేవుని జ్ఞానము జ్ఞాపకము రాగలదు. అందువలన పేదవానికి ఇతర ప్రపంచ విషయముల మీద ధ్యాసకంటే దేవుని జ్ఞానము మీద ధ్యాస ఎక్కువ కాగలదు. ప్రపంచ సుఖములు, ప్రపంచ విషయములు ధనము వలన సాధ్యమని తెలిసిన పేదవానికి వానివద్ద డబ్బులేదు కావున, వాని ధ్యాస ప్రపంచ విషయముల మీదికి పోలేదు. డబ్బు లేకున్నా దొరకు జ్ఞానము మీదనే వాని ధ్యాస ఉండగలదు. ధనవంతుని ధ్యాస అంతయూ ప్రపంచ విషయముల మీద ఉండును. ధనము చేత ప్రపంచ విషయములు నెరవేరును కనుక ధనికునకు ప్రపంచ ధ్యాస ఎక్కువగా ఉండును. అదే పేదవానికి ప్రపంచ విషయ ధ్యాస ఉండదు. ప్రపంచ ధ్యాసలను వాడు వదలుకొనియుండును. ధనము లేనిదానివలన ప్రపంచ ధ్యాసల జోలికి వాడు పోడు. అటువంటి వానికి దైవజ్ఞానము తెలిసిన వెంటనే జ్ఞానము మీదికి ధ్యాస పోవును. అందువలన వానిని దేవుని జ్ఞానము అను దరికి (గట్టుకు) దగ్గరగాయున్నవానిగా చెప్పవచ్చును. దరికి దగ్గరగాయున్నవాడు అయినందున పేదవానిని 'దరిద్రుడు' అని అనవచ్చును. ధనవంతునికి ఎంత జ్ఞానము చెప్పినా పట్టుపడదు. అతను ధనము చేత 'గర్వము' అను గుణములో మునిగి యుండును. అందువలన **ధనవంతునికి జ్ఞానము లభించుట కంటే సూది రంధ్రములో ఒంటె దూరుట సులభమని** చెప్పారు. ప్రపంచములో ధనములో అందరికంటే తక్కువ వానిని, ధనములేక కష్టములనుభవించు వానిని 'పేదవాడు' అని చెప్పుచున్నాము. 'పేద' అను పదమే 'బీద' అను పదముగా కూడా పిలువబడుచున్నది. ధనములేని పేదవానికి నేను మొదటి లేఖను వ్రాయపూనినాను.

# మొదటి లేఖ

ఇందుశ్రీ తుపాకుల వెంకటప్ప గారికి వ్రాయు ఉత్తరము ఏమనగా!

నీవు తక్కువ కులములో పుట్టినాననీ, పేదరికములో జీవించుచున్నాననీ అనుకుంటున్నావు. తక్కువ కులములో పుట్టినందుకు ఇతరులు నిన్ను అంటరానివారిగా చూస్తున్నారని బాధపడుచున్నావు. అంతేకాక పేదరికము వలన అందరికంటే తక్కువగా బ్రతుకవలసి వచ్చినదని అనుకుంటున్నావు. వీటినన్నిటినీ అధిగమించుటకు మతమార్పిడి చేసుకోవాలనుకుంటున్నావు. క్రైస్తవునిగా మారితే క్రైస్తవ సమాజములో అందరితో కలిసిపోవచ్చుని, అక్కడ కులవివక్ష ఉండదని అనుకొంటున్నావు. మతము మారుట వలన ఉద్యోగమును ఇస్తామని క్రైస్తవులు చెప్పారు. అలా ఉద్యోగము వస్తే పేదరికము నుండి బయట పడవచ్చునని కూడా అనుకొన్నావు. ఇటువంటి ఆలోచనలు మనిషికి రావడము సహజమే! పైగా నీవున్న పరిస్థితిలో ఎవరున్నా అలాగే ఆలోచింతురు. ఆలోచనలు గుణములనుండి పుట్టుచుండును. గుణములలో పుట్టిన ఆలోచనలను బుద్ధి గ్రహించి ఆలోచించను మొదలు పెట్టును. తర్వాత మనిషి గతములో చేసుకొన్న కర్మనుబట్టి చిత్తము నిర్ణయించును. గుణముల నుండి వచ్చిన ఆలోచనలలో బుద్ధి ఆలోచించగా, బుద్ధి యొక్క రెండు రకముల సూచనలలో కర్మానుసారము చిత్తము చిత్తగించును. అప్పుడు చిత్తము నిర్ణయించిన కార్యము జరుగును.

నీ గుణచక్రములో గల గుణములు మతమార్పిడి విషయము, ఉద్యోగము కొరకు మతమార్పిడి అవసరమను విషయము సంకల్ప ఆలోచనల రూపములో రాగా, బుద్ధి దానిని గ్రహించి రెండు విధములుగా ఆలోచించగా, చివరకు కర్మప్రకారము చిత్తము మతమార్పిడి పొందమనీ,

దానివలన ఉద్యోగ్యమును కూడా పొందమని నిర్ణయించినది. ఆ నిర్ణయము శరీరము లోపల ఈ విధముగా జరిగినదని నీకు తెలియక పోయినా, నీవు మాత్రము మతమార్పిడి పొందాలని అనుకున్నావు. ఇదంతయూ కర్మ ప్రకారము జరుగు విధానము. కర్మలో మతమార్పు చెందాలని ఉన్నప్పుడు ఆ విధముగా గుణములనుండి చివర చిత్తము వరకు పనిచేసి జరుగవలసిన పనిని సూచించును. అటువంటి నిర్ణయములు కర్మ విధానము వలన జరిగినవి, కావున వాటిని ఎవరూ కాదనలేరు. వచ్చిన నిర్ణయమును అందరూ ఆచరించవలసియున్నది. నీవు హిందువులలోనుండి క్రైస్తవులలోనికి మతమార్పు చెందితే క్రైస్తవులు సంతోష పడతారు, హిందువులు మా మతము క్షీణించిపోవుచున్నదని బాధపడతారు. కర్మప్రకారము జరుగ వలసిన కార్యములను ఎవరూ ఆపలేరు. ఎవరు కాదనినా, ఎందరు వద్దనినా జరుగవలసిన పనులు జరుగక మానవు.

దేవుడు మనుషులకు ఇచ్చిన జ్ఞానము వలన కర్మప్రకారము జరుగునను చెప్పెడి కార్యములను కూడా జరుగకుండా ఆపివేయవచ్చును. దేవుని జ్ఞానము కర్మను నిరోధించగలదు. దానిప్రకారము మనుషులు తమ తలలోని జ్ఞానమును ఉపయోగించి చిత్తము చేత నిర్ణయించబడిన కార్యములను కూడా జరుగకుండా ఆపివేయవచ్చును. కర్మలోయున్న కార్యములను మనిషి కర్మవశుడై చేయుచుండునని చెప్పినా, అటువంటి **కర్మలోని కార్యములను కూడా మనిషి తన జ్ఞానము చేత ఆపివేయగల సదుపాయమును దేవుడు కల్పించాడు.** దేవుడు ఇచ్చిన జ్ఞానము ప్రకారము యోచించగలిగితే ఇలా చెప్పవచ్చును. మనిషి కర్మప్రకారమే తన ప్రమేయము లేకుండా ఏదో ఒక కులములో పుట్టడము జరుగుచుండును. అలాగే వాడు బ్రతుకవలసిన జీవితము నిర్ణయించబడును. మతములు

పన్నెండుయున్నా అందులో ముఖ్యమైనవి మూడు మాత్రమే! హిందూ, క్రైస్తవ, ముస్లీమ్ అను మూడు మతములలో నీవు హిందూ మతములో పుట్టావు. పుట్టుకతో వచ్చిన మతము దేవుడిచ్చినదని తలచవలసియున్నది. మనిషి జీవితములో జరుగు పనులన్నీ కర్మప్రకారమే జరుగునవైనా, అందులో కొన్ని మంచి పనులు కొన్ని చెడు పనులు ఉండుట సహజమే!

కర్మప్రకారము జరుగు మంచి చెడు కార్యములు తన ప్రమేయము లేకుండా జరుగుచున్నవని మనిషి (జీవుడు) అనుకోగలిగితే వానికి ఎటువంటి పాపపుణ్యములు అంటుకోవు. ఒకవేళ మనిషికి కర్మ సిద్ధాంత జ్ఞానము తెలియకపోతే, జరిగే పనులన్నిటినీ జీవుడు తానే స్వయముగా చేస్తున్నానని అనుకుంటే, ఆ జీవునికి పాపపుణ్యములు తప్పక అంటుకొనును. అయితే నీవు ఇప్పుడు నీ వెనుక కర్మ నిన్ను నడిపించు చున్నదని తెలియక, మతము మారాలను నిర్ణయము నీదేయని అనుకొంటున్నావు. మతమార్పిడి దైవద్రోహమగును. కావున మతమార్పిడి వలన నీకు పెద్ద పాపము సంభవించగలదు. ఒకవేళ జ్ఞానము ప్రకారము నడుచుకోగలిగితే కర్మను పొందక తప్పించుకోవచ్చును. అట్లు కాకుండా జ్ఞానము వలన అనగా **జ్ఞానశక్తి వలన కర్మను నిరోధించినట్లే కార్యమునే నిరోధించవచ్చును.** అప్పుడు మతమార్పిడి చెందక హిందూమతములోనే ఉండవచ్చును. కొన్ని కర్మలలో కార్యములు జరిగినా వచ్చే కర్మను నిరోధించు కోవచ్చును. కొన్ని కర్మలలో కార్యములనే నిరోధించుకోవచ్చును. ఇప్పుడు నీవు మతమార్పిడి కర్మను కార్యరూపములో ఆచరించి రాబోయే కర్మను నిరోధించుటకంటే మొదటికే కర్మను ఆచరించక కార్యమునే చేయక పోవడము మంచిది.

మనిషి కొంత జ్ఞానమును బాగా తెలిసి జ్ఞానశక్తిని సంపాదించగలిగి యుంటే ఉన్న కర్మనే లేకుండా చేసుకోగలిగితే జరుగవలసినది జరుగకుండా ఆగిపోగలదు. ఇది మతమార్పిడి విషయముకాగా, రెండవది బ్రతుకు తెరువు కొరకు ఉద్యోగమును పొందుటకు క్రైస్తవ మతములో చేరాలను కొంటున్నావు. "ఉద్యోగము వలన బ్రతుకుతెరువు బాగుంటుంది" అని అనుకొంటున్నావు. **"భవిష్యత్తు అంధకారము"** అను సూత్రము ప్రకారము ముందు జరుగబోవు కాలములో ఏమి జరుగునో ఎవరికీ తెలియదు నీ జీవితము కాలము మొత్తము ఇలా బ్రతుకవలెనని ముందే నిర్ణయింపబడి యున్నది. అందువలన రాబోయే ఉద్యోగము వలన నీవు అనుకున్నట్లు జరుగుతుందని నమ్మకము లేదు. జరుగవలసినది ముందే నిర్ణయింపబడి ఉండునను విషయము తెలియక మనిషి తన స్వంత ప్రయత్నము చేయాలను కుంటాడు. దానివలన మనిషికి పాపపుణ్య కర్మలు అంటుకోవడము తప్ప జరిగేది ఏమీ లేదు. నీ జీవితములో నిన్ను శాసించి నడిపించు కర్మ ఒకటున్నదని నీకు తెలియక నీ స్వంత ప్రయత్నము చేశావు. దానికంటే నీవు చేయవలసిన ముఖ్యమైన కార్యమొకటి గలదు. నీ ఆధీనములో లేకుండా నిన్ను నడిపించు కర్మలను నీవు లేకుండా చేసుకోవడమే ముఖ్యమైన పని. నిరుపేద జీవితమని, హీన కులమని నీవు జీవితమును మార్చు కొనుటకు, ఉద్యోగమును చూచుకోవాలనుకున్నావు. అట్లే హీన కులమని మతమునే మార్చాలనుకొన్నావు. అలా మతమును మార్చుకొనినా, ఉద్యోగమును చూచుకొనినా, నీ జీవితము మారుతుందను నమ్మకము లేదు. జీవితములో మార్పురావాలంటే కులములో గౌరవము గానీ, వృత్తిలో ప్రతిష్టగానీ రావాలంటే కర్మనుబట్టియే ఉండును. అందువలన కర్మను మార్చుకోవడమే నీవు ముందు ముఖ్యముగా చేయవలసిన పనియని తెలుసుకో!

జీవితములో ఉన్న కర్మ పోవాలంటే, జీవితములో మార్పురావాలంటే ముందు దైవజ్ఞానమును గురించి తెలుసుకో. అయితే నీకు కొన్ని అనుమానములు ప్రశ్నల రూపములోవచ్చి దాదాపు 50 సంవత్సరముల వయస్సులో నాకు జ్ఞానము తెలియునా? అని ప్రశ్నలు రాగలవు. జ్ఞానమునకు వయస్సుకు సంబంధము లేదు. ఏ వయస్సులో అయినా దైవజ్ఞానమును తెలియవచ్చును. జ్ఞానముతో నీ జీవితములో జరుగు సమస్యలకు పరిష్కారము దొరుకును. ప్రస్తుతము నీ జీవితములో ఒక సంఘటన జరిగినది. నీవు హరిజన కుటుంబములో పుట్టినవాడవు. నీలో ఎటువంటి చెడుభావము లేకున్నా, నీ ప్రమేయము లేకుండా నీ జీవితములోనికి ఒక బ్రాహ్మణ స్త్రీ వచ్చి నిలిచిపోయినది. నీ ప్రయత్నము ఏమీ లేకున్నా ఆమెయే నీ మీద ఇష్టమును పెంచుకొని నీ వద్దకు రావడము జరిగినది. ఆమె పెళ్ళయిన తర్వాత పది సంవత్సరములు భర్తతో కాపురము చేసి చివరకు భర్తను వదలివేసి నీ వద్దకు వచ్చినది. ఆమెకు సంతతి లేదు కావున భర్త కూడా ఆమెను గురించి పట్టించుకోకుండా వదలివేశాడు. ఆమె నీవద్దకు వచ్చి దాదాపు ఐదు సంవత్సరములయినది. ఇప్పుడు ఆమె గర్భము ధరించి ఏడు నెలలుగా యున్నది. ఇటువంటి పరిస్థితిలో ఆమె భర్త వచ్చి ఆమెను తిరిగి తనవద్దకే రమ్మని పిలుస్తున్నాడు. ఐదు సంవత్సరముల నుండి నీవద్దయున్న ఆ బ్రాహ్మణ స్త్రీ “నా భర్త పిలుస్తున్నాడు నేను అక్కడికి పోవాలా లేక ఇక్కడే ఉండాలా?” అని నిన్ను సలహా అడిగింది. ఆ మాటకు నీవు ఎటూ సమాధానము చెప్పలేక అయోమయ స్థితిలో పడిపోయావు. ఏమీ అర్థముకాని స్థితిలో నీవుండిపోయావు. ప్రపంచ రీత్యా ఎటూ తేల్చుకోలేని ఇటువంటి సమస్యలు మనిషి జీవితములో అనేకము వచ్చుచుండును. ఈ విధమైన సమస్యలతో మనిషి మానసిక వ్యథకు గురియైపోగలడు. మానసిక బాధకు బయటి ఔషధములు

పనికిరావు. అందువలన మనిషి మానసిక బాధనుండి బయటపడాలంటే అతనికి దైవజ్ఞానమే ఔషధముగా పని చేయును. అందువలన ముందు నీ సమస్యను పరిష్కారము చేసుకొనుటకు దైవజ్ఞానమును తప్పక తెలుసుకో!

జ్యోతిష్య శాస్త్రము ప్రకారము నీవు నీ జీవితములో దయ్యాల చేత పీడింపబడుచున్నావు. గతములో దయ్యాలచేత ఎన్నో బాధలను అనుభవించావు. జరుగబోవు కాలములో కూడా వాటి చేత ఎన్నో బాధలు అనుభవించవలసి యున్నది. ఆ బాధలనుండి తప్పించుకోవాలంటే కర్మలను కాల్చు జ్ఞానమను అగ్ని నీ దగ్గరుండాలి. **జ్ఞానాగ్ని** నీవద్ద ఉన్నప్పుడు అనుభవించవలసిన కర్మలనుండి బయటపడవచ్చును. జ్ఞానాగ్ని వలన కర్మలను కాల్చుకోవచ్చును. జీవితములో ఎంతోమార్పును తెచ్చు జ్ఞానమును, మనిషి యొక్క కర్మలను కాల్చివేయు జ్ఞానమును, ప్రపంచములో అందరికీ సమానముగా అందుబాటులోయున్న జ్ఞానమును, అన్ని మతములలో ఒకేశక్తి గలదై కర్మలను లేకుండా చేయు జ్ఞానమును, నీవు ఇప్పటినుండి తెలుసుకో. ప్రపంచములో దైవజ్ఞానమను ముసుగులో అనేక జ్ఞానములు గలవు. వాటిని చూచి వాటి జోలికి పోకుండా అసలయిన జ్ఞానమును గుర్తెరిగి దానిని తెలుసుకొనుటకు ప్రయత్నించుము.

నేడు నీవు జ్ఞానమును తెలుసుకుంటానని అనుకున్నా ఏది నిజమైన జ్ఞానమని తెలియక శక్తిలేని జ్ఞానములను, అగ్నికాని జ్ఞానములను మనిషి ఆశ్రయించుచున్నాడు. అటువంటి జ్ఞానములను ఆశ్రయించుట వలన మనిషివెంట వచ్చియున్న కర్మ పోదు. క్రొత్తగావచ్చు కర్మ రాకమానదు. అటువంటి జ్ఞానములతో ఎటువంటి ప్రయోజనము ఉండదు. అందువలన ప్రస్తుత కాలములో అచలమనీ, కుమారి సమాజమనీ, శ్వాసమీద ధ్యాసయనీ, వైష్ణవమనీ, శైవమనీ పిలువబడే వారి చెంత చేరి ఎంత

జ్ఞానమును తెలిసినా ప్రయోజనముండదు. అందువలన **కర్మలను దహించు శక్తిగల త్రైత సిద్ధాంత బోధలను** తెలిసి ఆచరించగలిగితే, నీ కర్మలు కాలిపోవును. అనుభవించే కర్మకూడా మధ్యలో వైదొలగి పోవును. అందువలన నీ శ్రేయోభిలాషిగా నేను చెప్పునదేమనగా! నీవు త్రైత సిద్ధాంత జ్ఞానమును తెలుసుకో! మూడు గుణముల కర్మలనుండి బయటపడిపో!! కర్మలకు దవ్వుగాయుండు, త్రైత జ్ఞానమునకు దాపుగాయుండు!!!

ఇట్లు

మీ శ్రేయోభిలాషి

**ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

## రెండవ లేఖ

ప్రభుత్వ పాలకునికి...

గౌరవనీయులయిన P.K. రావుగారికి వ్రాయు ఉత్తరము ఏమనగా! మీరు రావుగారు అను పేరుతోయున్నా మిమ్ములను అందరూ రెడ్డిగారు అని పిలుస్తారు. మీ నిజమైన పేరు పాడుకుంటారెడ్డిగారు. మీకు నేను వ్రాయు లేఖ మీలో మార్పును తెస్తుందని నమ్ముచున్నాను, మార్పు తేవాలని కోరుకొంటున్నాను. మీరు చిన్నప్పటి నుండి నాయకత్వ లక్షణములు కలిగియున్న మాట వాస్తవమే అయినా, దానితోపాటు ఆరు చెడు గుణములు అందరికంటే ఎక్కువగా కలిగియున్నారు. మీరు కొన్ని సంవత్సరములుగా రాజకీయములో ఏదో ఒక పాత్ర పోషించినా మీరు నాయకునిగానే మిగిలి యుండెడివారు. దాదాపు మీ వయస్సు యాభై సంవత్సరములు గడచి పోయిన తర్వాత ఇప్పుడిప్పుడే ప్రభుత్వములో పాలకునిగా ఎన్నుకోబడినారు.

ప్రభుత్వ హోదా కలిగియున్నారు. మీరు రాజకీయములోనికి రావాలను కొన్నప్పటినుండి చేసిన కార్యములన్నియూ చెడు గుణములతో కూడుకొన్న చెడు కార్యములే గలవు.

రాజకీయ భవిష్యత్తు కొరకు నీవు చేసిన పనులన్నియూ పూర్తి ధ్యాస కలిగి, పూర్తి బుద్ధితో యుక్తిగా చేయడమైనది. అయితే ప్రతి పని వెనుక నీవు నీవనుకొన్న రాజకీయములో కొంత ఎదుగుతూ వచ్చావు. నీవు చేసినవి నీ అభివృద్ధికే అయినా, అవి అన్నీ మంచి గుణములతో చేసినవి కావు. అన్నీ చెడు గుణములతో చేసినవే ఉన్నాయి. ఎవరికయినా ఒక కార్యమును చేయునప్పుడు తన ఉద్దేశ్యము మీదనే ధ్యాస ఉంటుంది గానీ తాను చేయుపని చెడుదా, మంచిదా అని ఎవరూ చూడరు. ఎవరి లెక్కలో వారు చేయు పని మంచిగానే కనిపించుచుండును. నీ లెక్కలో నీవు చేసినది నీకు మంచిదే. దాని ఫలితముగా రాజకీయములో నీవు ఎదుగుచూ వచ్చావు. రాజకీయ రంగములో నీవు అభివృద్ధి చెందినట్లు నీకు అర్థమయినది. దాని ఫలితముగా నేడు అధికార పార్టీలో ఒక నాయకుడుగాయుంటూ, ప్రభుత్వ పాలనలో ఒక హోదా కల్గిన పదవిలో యున్నావు.

నీవు చేసిన ప్రతి పని వెనుక రెండు ఫలితములున్నాయని నీకు తెలియదు. నీకు తెలిసినది ఒక ఫలితము మాత్రమే. అది కనిపించే ఫలితము. నీవు చేసిన పనులకు నీవు రాజకీయముగా ఎదిగినానని మాత్రము నీకు తెలుసు. అదే నీకు తెలిసిన ఫలితము. అయితే నీకు కనిపించకుండా, ఏమాత్రము తెలియకుండా కంటికి కనపరాని ఫలితము కూడా ఒకటి వచ్చియున్నదని నీకు తెలియదు. కంటికి కనిపించే ఫలితము ఏ రూపములో అయినా ఉండవచ్చును. అది నీకు రాజకీయముగానే

ఎక్కువ జరిగింది. కంటికి కనిపించని ఫలితము మాత్రము 'పాపము మరియు పుణ్యము' అను రెండు రకములుగా వచ్చియుండును. అయితే చేసిన పని మంచిదైయున్నప్పుడు అనగా! ఆరు మంచి గుణములతో చేసియుంటే, వాటి వలన పుణ్యము వచ్చును. అట్లుకాక నీవు చేసినది ఆరు చెడు గుణముల పనులే అయినందున నీకు వచ్చినది మొత్తము పాపమే అని తెలియుచున్నది. పాపము మరియు పుణ్యములను రెండిటినీ కలిపి 'కర్మ' అని అంటున్నాము. నీ కార్యముల వలన పాపకర్మయే ఎక్కువ వచ్చినది. వచ్చిన కర్మ నీ తలలోని కర్మచక్రములో నమోదై నిలిచిపోవు చున్నది. ఈ జీవితములో వచ్చిన కర్మ తర్వాత జన్మలలో అనుభవానికి వచ్చును. కావున ఇప్పుడు మేము చెప్పినా ఎవరికీ అర్థము కాదు.

నీవు చేసిన పాపములు నీకు అర్థమగుటకు రెండు లేక మూడు సంఘటనలను వివరిస్తాను చూడు. నీవు రాజకీయములో ఎదగాలను కొన్నావు. దానికొరకు ఎన్నో చేయరాని పనులను చేశావు. ప్రపంచ సంబంధ పాపములను చేస్తే అవి ఒకమారు అనుభవిస్తే అయిపోవును. లేక దేవున్ని ఆశ్రయించినా, దైవజ్ఞానమును ఆశ్రయించినా ఆ పాపములను అనుభవించకుండా క్షమించబడును. అయితే దేవునికిగానీ, జ్ఞానమునకు గానీ వ్యతిరేఖముగా చేసిన పాపములు ఒకమారు అనుభవించినా అయిపోవు. అవి నిత్యము పాపములై సజీవముగా రెండు యుగముల పర్యంతము అనుభవానికి వచ్చుచునేయుండును. అటువంటి పాపములు దేవుని వలనగానీ, దేవుని జ్ఞానమును తెలియుట వలనగానీ (ఆశ్రయించుట వలనగానీ) క్షమించబడవు. వాటిని 'క్షమించబడని పాపములు' అని అంటాము. నీవు నీ జీవితములో అటువంటి క్షమించరాని పాపములు చేశావు. నేను ఇప్పుడు నీకు లేఖ వ్రాయుట ద్వారా అయినా ఇంకా

అటువంటి కార్యములను చేయకుండా మార్పు చెందగలవని అనుకుంటున్నాను.

జీవితములో దైవజ్ఞానము మీద దృష్టి తప్ప ప్రపంచ జ్ఞానము మీద ఏమాత్రము ధ్యాసలేని ఒక జ్ఞాని విషయములో నీవు నీ రాజకీయ స్వార్థము కొరకు అనుచితముగా ప్రవర్తించావు. దైవజ్ఞానమును అనుసరించుచూ, ఇతరులకు కూడా దైవజ్ఞానమును తెలుపుచూ ప్రజలనందరినీ దైవజ్ఞానులుగా మార్చాలని నిత్యము ప్రయత్నము చేయు ఒక జ్ఞానిని చూచి నీవు ఓర్వలేక అసూయ గుణముతో ప్రవర్తించావు. ఆయన వద్దకు ఎందరో జ్ఞాన జిజ్ఞాసులు జ్ఞానమును తెలియుటకు వచ్చు చుండగా, దానిని చూచి అతను జనములను ఆకర్షించుచున్నాడనీ, అతను కూడా తనవలె రాజకీయములో ఎదగాలనుకున్నాడనీ అనవసరముగా ఊహించుకొన్నావు. ఆయనవద్దకు ప్రజలు జ్ఞానమును తెలియుటకు మాత్రమే వస్తున్నారని అనుకోకుండా తనవలె రాజకీయములో పోవుటకు అతనిని నాయకునిగా చేసుకొన్నారని అనుకొన్నావు. దైవజ్ఞానమును చెప్పు ఆయన ఉద్దేశ్యమును తెలియక, ఎవని చింత వానికన్నట్లు నీవు రాజకీయములో నాయకునిగా ఎదగాలనుకొన్నట్లు ఆయన కూడా ప్రయత్నము చేయుచున్నాడనీ, ఆ ప్రయత్నములో భాగముగానే జనాన్ని సమీకరిస్తున్నాడనీ, అందువలననే నావద్దకు రానంత జనము అతనివద్దకు పోతున్నారని అనుకోవడము జరిగినది. "చోరులకు చోరచింత, వ్యభిచారులకు వ్యభిచారచింత" అన్నట్లు నీవు రాజకీయములో చింత చేయుచూ నీవలె మిగతా వారిని ఊహించుకొన్నావు. దైవజ్ఞానము కొరకు ఒకచోట చేరు ప్రజలను 'రాజకీయము కొరకు' అని నీ చింత ప్రకారము అనుకొన్నావు.

మనిషి ఒకమారు తప్పుడు ఆలోచనలో పడిన తర్వాత తన ఆలోచనే సక్రమమైనదని అనుకొనుచుండును. అటువంటప్పుడు ఇతరులు మంచి చెప్పినా దానిని ఎవరూ గ్రహించరు. అన్నిరకములా తమ నిర్ణయమే సత్యమైనదని అనుకొనుచుందురు. నీవు అలాగే మారిపోయావు. నీ మేలు కోరువారు నీ ఆలోచన సరియైనది కాదనీ జ్ఞానమును బోధించు వ్యక్తిని రాజకీయ వ్యక్తిగా అనుకోవడము పొరపాటని చెప్పినా నీవు వారి మాటలను వినలేదు. రాజకీయము లేనిది అంతమంది ప్రతి దినము ఎందుకు అతని వద్దకు పోతారు? అని అనుకొనుచుంటివి. ఇట్లు ఒక దైవజ్ఞాని మీద దురభిప్రాయమును పెంచుకొన్న నీవు ఏమాత్రము ముందు వెనుక ఆలోచించకుండా జ్ఞానమును బోధించు అతని మీదికి చెడు ఆలోచనలు చేయను మొదలుపెట్టావు. అసూయ గుణముతో జ్ఞానిని ఎలా దెబ్బ తీయాలా! అని చూచావు. పైకి ఏమీ తెలియని వానిగా, ఏమీ చేయనివానిగా నటిస్తూ లోలోపల జ్ఞానిమీద కుట్రలు కుతంత్రములు చేయను మొదలుపెట్టావు. ఎవరికీ ఏ అనుమానము రాకుండా నీ నీచ క్రియలు చేయను ప్రారంభించావు. ఎవరికీ తెలియకుండా చేసిన పనులు నీకెలా తెలిశాయి? అని నీకు ప్రశ్న రావచ్చును. రహస్యముగా గమనించుచూ వారివద్దనే నేనున్నానని చాలామందికి తెలియదు. ఎవరికీ తెలియకుండా వారివద్దనే కాలము గడుపుచున్నాను కావున నీ ఒక్కని విషయమే కాదు, చాలామంది రహస్యములు నాకు బాగా తెలియును.

నీవద్దకంటే ఎక్కువ జనము ఎవరివద్దకు చేరుచున్నారో ఆ వ్యక్తి నీకు రాజకీయ ప్రత్యర్థిగా మారుననీ, అతను రాజకీయములో వుంటే అతని ముందర నేను నిలబడలేనని తలచిన నీవు, అతనిని ఏదో రకముగా దెబ్బతీసి అతను నీ ఊరిలోనే లేకుండా పోవునట్లు చేసుకోవాలనుకున్నావు.

నీవున్నచోట అతను లేకుండా పోతే రాజకీయముగా నీవు సులభముగా ఎదుగవచ్చునని అనుకున్నావు. దానికి కావలసిన ప్రయత్నములన్నియూ చేశావు. ఇతర చిల్లర మనుషులను, రౌడీలను ప్రేరేపించి జ్ఞానిని దెబ్బ తీయాలని చూచావు. దైవజ్ఞానము తెలిసినవారు సూక్ష్మగ్రాహులైనందున నీ కుట్రలను కుతంత్రములను అక్కడ నీ ఊరిలోనే ఉన్న జ్ఞాని గ్రహించ గలిగాడు. నీ తెలివి తక్కువ ఆలోచనలకు, అసూయ పూరిత కార్యములకు దూరముగా ఉండవలెనని అనుకొన్నాడు. దైవజ్ఞానమును కోరువారు ఎక్కడుండినా ఒక్కటే అను ఉద్దేశ్యముతో అతను నీ గ్రామమును వదలి దాదాపు రెండువందల మైళ్ళ దూరముపోయి నివాసము ఏర్పరచుకొన్నాడు. అక్కడ కూడా అతను ప్రజలకు జ్ఞానమును తెలియజేస్తూ దైవసేవ చేసు కొనెడివాడు.

నీ స్థానము నుండి జ్ఞాని అయిన ఆయన దూరముగా పోవడము నీకు సంతోషమును కల్గించినది. రాజకీయములో సులభముగా ఎదగ వచ్చుననుకొన్నావు. అలాగే ఎదిగావు. అయితే జ్ఞానమును బోధించు జ్ఞాని అక్కడున్నా నీవు రాజకీయముగా ఎదిగేవానివే! అనవసరముగా నీ అనుమానము పెనుభూతమై నిన్ను చెడు దారిలో నడిపించినది. ఒక దైవ జ్ఞానిమీద కుట్రలు చేయడము వలన, ఆయనను అనవసరముగా స్థాన భంగము చేయుట వలన, ఆ ప్రాంతములో జ్ఞానము తెలియు జిజ్ఞాసుల కందరికీ నీ చర్యవలన జ్ఞానము తెలియకపోవడము వలన, ఇట్లు జ్ఞాన విషయములో చేసిన చెడు ప్రయత్నము వలన నీకు పాపము కనిపించని ఫలితముగా వచ్చినది. అలా వచ్చిన పాపము దేవుని జ్ఞాన విషయములోనిది అయినందున అది క్షమించరాని పాపముగా మారినది. నీవు రాజకీయముగా ఈ జన్మలో మాత్రము లాభము పొందగలవు. అయితే వచ్చిన పాపము

వలన రెండు యుగముల పర్యంతము ఆ పాపమును అనుభవించవలసి యుంటుంది. చిన్న లాభము కొరకు పెద్ద నష్టమును తెచ్చుకొన్నావు. ఒక్క రూపాయి కొరకు ఆశపడి వందకోట్ల అప్పు చేయడము ఎలాగుండునో అలాగే ఇప్పుడు నీవు చేసిన పనియున్నదని చెప్పుచున్నాము.

ఇప్పుడు దాదాపు నీ వయస్సు యాభై సంవత్సరముల పైన అరవై సంవత్సరముల లోపలయున్నది. ఇంతకాలముగా ఎన్నో నీచమైన ఆలోచనలు చేస్తూ, ఎందరినో పరోక్షముగా నష్టపరుస్తూ, ప్రత్యక్షముగా బాగా కనిపించినా కనిపించకుండా గోతులు త్రవ్వుచూ, లోపల ఒకటి బయట మరొకటిగా మాట్లాడుచూ, ఎన్నో చెడు కార్యములు చేయుచూ, పైకి మంచిగా కనిపించుచూ వచ్చినందుకు ఇంతకాలానికి రాజకీయముగా ఎదిగి అధికార పార్టీలో గొప్ప హోదాగల పదవిని నీవు పొందావు. అది ఎంత కాలముంటుందో ఎవరికీ తెలియదు. అది ఎంత కాలమున్నా నీవు ఎంతకాలము ఇక్కడుంటావో నీకే తెలియదు. ఈ ఐదు సంవత్సరముల పదవిలో యుండి తర్వాత దిగిపోవచ్చును లేదా నీ అదృష్టము బాగుంటే రెండవమారు కూడా నీవే గెలిచి నీ పార్టీనే అధికారములోయుండి, నీవు ముఖ్యమంత్రి పదవినే పొందవచ్చును అనుకో. అది ఎంతకాలముంటుందో ఎవరికీ తెలియదు. అందువలన నేను మీలాంటి వారికందరికీ తెలియులాగ ఒక వాక్యమును వ్రాసియుంచాను. అది **"నీ ఉద్యోగము, నీ హోదా, నీ అధికారము, నీ ధనము, నీ పలుకుబడి కొంతకాలముండునవే, నీ శరీరము కూడా నీ మాట వినని రోజుంది జాగ్రత్త!"** అని గలదు.

నా వాక్యమును చూచిన చాలామంది అందులోని సత్యమును గ్రహించి "మీరు చెప్పినది వాస్తవమే! మేము ముందు వెనుక చూడకుండా ఇంతకాలము బ్రతికాము. ఇప్పుడు మేము చేసిన తప్పు మాకు అర్థమగు

చున్నది. మేము కాలమును ఇంతవరకు వృథాగా గడిపాము. ఇప్పుడు మీ వాక్యమును చూచి మేల్కొన్నాము. ఇప్పుడు ఏమి చేయాలి? మా కర్తవ్యమేమిటి? బావిలోని కప్పవలె కనిపించేదే జీవితము కనిపించనిది ఏదీ లేదనుకొన్నాము. ఇప్పుడు కనిపించని కర్మ మమ్ములను వదలదని తెలియుట వలన మేము జాగ్రత్త పడినాము. మీరు చెప్పినట్లు నడువ గలము" అని చెప్పుకోవడము జరిగినది. మనస్సులో మార్పు వచ్చిన వారందరికీ చెప్పు సలహా ఒక్కటే. నీవు జీవించు కాలము తక్కువగా యున్నది. ఇప్పటినుంచయినా దైవజ్ఞానమును తెలుసుకో (Time is short do it now)

నా సలహా కొందరికి మాత్రము నచ్చినదిగానీ అందరికీ నచ్చినదని చెప్పలేము. పనిపాటలేని వారు, సోమరిపోతులు, బ్రతుకలేని ప్రతి వెధవ ఇటువంటి మాటలు చెప్పుచుందురు. మాటలు చెప్పి బ్రతుకుచుందురని మంచిని చెప్పు మమ్ములను కూడా హేళనగా మాట్లాడువారు గలరు. అటువంటి వారికి మేము చెప్పుమాటలు రుచించవు. నీవు కూడా ప్రస్తుతానికి అదే దారిలోయున్నావు. జీవితములో ముఖ్యమైనది, జీవితానికే సారాంశమైనదియైన దైవజ్ఞానమును చెప్పితే, నీవు అనేకమార్లు పెడచెవిన పెట్టి, చెప్పిన వారినే నిందించి పంపావు. "రోగమున్నవానికే వైద్యము అవసరము" అన్నట్లు అజ్ఞానముతో కూడుకొని మంచియొక్క విలువను, జ్ఞానము యొక్క ఔన్నత్యమును తెలియని నీకు మేము మరొక్కమారు జ్ఞానమును విను అవకాశమును కల్గించాము. ఈ మారు నేను నీవు చేసిన పాపములనే వివరిస్తాను. దానివలన పాపభీతి కలిగితే ఇప్పటికయినా నీవు కర్మలనుండి బయటపడగలవు. ఇంతవరకు ముందు నీవు ఒక జ్ఞాని యెడల చేసిన పాపమును గురించి చెప్పాను. ఇప్పుడు అలాంటిదే మరొకటి

చెప్పగలను. దీనిని వినిన తర్వాత నీవు పాపభీతిని పొందకపోతే నిన్ను బాగు చేయువాడు ఎవడూ ఉండడు. బుద్ధి ప్రతి మనిషికీ యుంటుంది. అయితే ఆ బుద్ధిని వేరువేరు ప్రపంచ విషయముల మీద ఉపయోగించు నీవు ఇప్పుడు నేను చెప్పు విషయము మీద ఉపయోగించి, నా ఉద్దేశ్యమును తెలియవలెనని చెప్పుచున్నాను.

గతములో ఒకమారు నీ రాజకీయ ప్రయోజనముల కొరకు జ్ఞానబోధ చేయు వ్యక్తిని ఊరు విడచిపోవునట్లు కుట్రలు కుతంత్రములు చేశావు. తర్వాత కొంత కాలమునకు రాజకీయములో నీవున్న పార్టీ పెద్దలు నిన్ను తమపార్టీలో ఒక నాయకునిగా ప్రకటించారు. ఎన్నికల సమయములో పోటీ చేయుటకు అర్హతా పత్రమయిన ‘బి’ ఫారమును కూడా ఇచ్చారు. దానితో ఎన్నికలలో పోటీ చేశావు. నీవున్న ఊరిలో ఒక ఆశ్రమము కూడా యున్నది. ఆ ఆశ్రమములో అన్నార్థులై వచ్చిన వారికి జ్ఞానార్థులై వచ్చిన వారికి, ఎక్కడా అనుకూలము లేక అక్కడికి వచ్చి ఆశ్రయము పొందిన వారికి నిత్యము అన్నదానము చేయుట పరిపాటిగా యున్నది. ఒకరోజు, రెండు రోజులు అని కాకుండా ఎల్లకాలము ఆకలిగొన్న వారికి అన్నము పెట్టు కార్యము నిత్యము జరిగెడిది. ఎన్నో సంవత్సరములనుండి అట్లు అన్నదానము చేయడము జరిగెడిది. అయితే నీ ఎలక్షన్ రోజు రెండు వందలమంది క్రొత్తవారు ఆశ్రమానికి పోయి భోజనమును అడుగడము జరిగినది. ఆ దినము ఎన్నికలు జరుగుచుండుట వలన, ఊరిలోని అన్ని హోటళ్ళు, అన్ని లాడ్జీలు నిండిపోయి వుండుట వలన, ఒక్కరోజు ఉండేదానికి ఆశ్రయము, అన్నము అడిగారు.

ఎన్నో సంవత్సరములనుండి అన్నదానము చేయు ఆశ్రమము అయినందున ఆశ్రమాధిపతి అంతమందికి ఉచితముగా అన్నము

పెట్టుతామని చెప్పి ఆశ్రయమివ్వడము జరిగినది. అలా ఆశ్రయము పొందిన వారందరూ ఇతర రాజకీయ పార్టీవారని నీవు అనుకోవడము జరిగినది. ఆశ్రమాధిపతి యైన స్వామీజీయే నీకు వ్యతిరేఖముగా ఎక్కడోయున్న వారిని తెచ్చి తన ఆశ్రమములో పెట్టుకొని, వారిచేత దొంగ ఓట్లను నీకు వ్యతిరేఖముగా వేయించాలని అనుకున్నాడని నీవు అనుకోవడము జరిగినది. ఆశ్రమాధి పతియైన స్వామీజీ ఎటువంటి రాజకీయముతో సంబంధము లేకున్నా, నీ మీద ఎటువంటి దురుద్దేశ్యము లేకున్నా, నీవు మాత్రము స్వామీజీని చెడుగా అనుకోవడము జరిగినది. నీవు రాజకీయములోయుండి ఎన్నో నీచకీయములు చేయుచూ, దానినే రాజకీయమనుకొను నీవు ఒక ఆశ్రమమును స్థాపించి ఆకలికి అన్నము, బుద్ధికి జ్ఞానమును చెప్పుచూ ఎల్లప్పుడూ దైవచింతనలో యున్నవారిని కూడా నీవు నీచముగా తలువడము, వారిని కూడా రాజకీయ ప్రత్యర్థులుగా నీవు భావించడము చేశావు. అంతటితో ఆగక ఆశ్రమము వారు చేయుచున్న పనేమిటి? అని ఆలోచించ కుండా వారిని అనేక ఇబ్బందులకు గురియగునట్లు చేయడము జరిగినది. నీవు ప్రత్యక్షముగా ఏమీ చేయకున్నా, నీ అనుచరులతో అగౌరవముగా ఆశ్రమము వారి యెడల ప్రవర్తించునట్లు, మాట్లాడునట్లు చేశావు. నీ అనుచరుల వలన ఆశ్రమముయొక్క అధినేత మనస్తాపమునకు గురియై నాడని తెలిసి కూడా అది నీ తప్పని అనుకోలేదు. నీ రాజకీయ భవిష్యత్తు కొరకు సాధారణ మనుషులను ఎందరినో ఇరుకున పెట్టినట్లే, అన్నదానము చేసినది నీకు తప్పుగా కనిపించి వారిని కూడా ఇరుకున పెట్టావు.

ప్రతి మనిషి చేయు ప్రతి పనికి దేవునివద్ద ఒక లెక్కయుంటుంది. అక్కడ వ్రాయబడిన లెక్కనే 'కర్మ' అంటాము. తుచ్ఛమైన, అశాశ్వితమైన, ఏ పవిత్రత లేని నీచరాజకీయము కోసము, దేవుని మార్గములో యున్న

స్వామీజీకీ కీడు తలచిన దానివలన నీవు కర్మలెక్కలో లెక్కించబడినావు. అది సాధారణ మనిషి యెడల చేసిన తప్పుకాదు. ఎంతో జ్ఞాన సముపార్జన చేసి, జ్ఞానశక్తి కలవారిమీద, నిత్య అన్నదానము చేయువారి మీద చేసిన తప్పుకు, వారికి జరిగిన అసౌకర్యమునకు నీవు, నీ రాజకీయమే బాధ్యత అయినందున నీవు పాపమును మూటకట్టుకోవలసి వచ్చినది. ఒక పనిలో తాను చేసిన పాపమెంత? తాను తలకు ఎత్తుకున్న పాపమెంతయని ఎవరికీ తెలియదు. అలాగే అన్నదాన విషయములో, స్వామీజీ మీద నీవు తలచిన భావమునకు నీకు క్షమించరాని పాపము వచ్చినది. క్షమించరాని పాపము నీ జీవితములో రెండవ మారు సంపాదించుకొన్నావు. ముందే ఒకమారు సంపాదించుకొన్న పాపమును అనుభవించుటకు దైవ గ్రంథము సాక్షిగా రెండు యుగములు పట్టునని తెలిసినది. రెండవ మారు సంపాదించుకొన్న క్షమించరాని పాపము వలన మరియొకమారు నాలుగు యుగముల పాపము నీ తలలో చేరిపోయినది. అది ఇది కలుపుకొంటే మొత్తము నాలుగు యుగములు నిత్యపాపివైపోయావు. ఒక జన్మలోని సుఖము కొరకు, హోదా కొరకు రెండు యుగములలో ఎన్ని జన్మలెత్తి, ఎంత కర్మ అనుభవించవలసి యుంటుందో, ఇదంతా దైవికమైన పాపము యొక్క నమూనా చెప్పాను. ప్రపంచ సంబంధమైన పాప విషయమును గురించి నీవు చేసిన దానినే వివరిస్తాను విను.

నీ తలలో భార్య పిల్లల మీద ధ్యాసకంటే, రాజకీయ పదవుల మీదనే ధ్యాస ఎక్కువ యుండడము వలన, రాజకీయ కార్యములను గురించి వెనుకా ముందు చూడకుండా పాపములను చేశావు. ఎన్నికలలో నీకు ఓటు వేయలేదను కక్షతో ఒక కుటుంబమును ఆర్థికముగా దెబ్బ తినునట్లు చేశావు. ఓటు వేయలేదను నెపముతో పోలీసు కేసులలో ఇరికించి వారిని

అనేక ఇబ్బందుల పాలు చేశావు. అంతేకాక ఆ కుటుంబ పెద్దను, వారికి ప్రత్యర్థులుగాయున్నవారిని రెచ్చగొట్టి వారిచేత హత్య చేయించావు. హత్య వెనుక నీ హస్తమున్నట్లు ఎవరికీ తెలియకుండా జాగ్రత్తపడ్డావు. సమాజములో దుష్టులుగాయున్నవారిని, రౌడీలుగాయున్న వారిని చేరదీసి వారిచేత ప్రజలను భయపడునట్లు చేసి నీ ఆధిపత్యముండునట్లు, నీకు ప్రత్యర్థులు లేకుండునట్లు చేశావు. ప్రభుత్వ సొమ్మును కొంత ప్రజలకు వినియోగించి మంచిచేయునట్లు కనిపిస్తూనే, ప్రజలకు తెలియకుండా ఎంతో సొమ్మును కూడబెట్టుకొన్నావు. రాజకీయములోనికి రాకముందున్న ఆస్తికంటే వందరెట్లు ఎక్కువ ఆస్తిని సంపాదించుకొన్నావు. అయితే ఇదంతా నీకు కనిపించేది. కనిపించనిది మరొక ఆస్తి నీకు తెలియకుండా నీ వద్ద గలదు. అదే నీవు సంపాదించుకొన్న కర్మ. మనిషికి రెండు సంపాదనలు ఉంటాయని తెలియని నీవు, ముందు ఉన్న ఆస్తికంటే వందరెట్లు ఎక్కువ సంపాదించుకొన్నట్లు, పాపమును కూడా అట్లే సంపాదించుకొన్నావు. ఇప్పుడు చెప్పినదంతా ప్రపంచ పాపమే.

ప్రపంచ పాపమును ఎంత సంపాదించుకొనియుంటే అంతే అనుభవించవలసి యుంటుంది. ఇది దైవికమైన పాపమువంటిది కాదు. దైవిక పాపము నిత్యపాపము అది ఒకమారు అనుభవిస్తే అయిపోదు. ప్రపంచ పాపము అలా కాదు. ప్రతి పాపమునకు ఒక అనుభవము మాత్రమేయుండును. తప్పుకు తగిన శిక్ష అమలగును. ప్రపంచ పాపము అనుభవిస్తే అయిపోవుచుండును. ప్రపంచ పాపమయినా నిత్యము సంపాదించియుండుట వలన, చిన్న తప్పులే కాకుండా పెద్ద తప్పులు చేసి యుండుట వలన, ఒక గంటలో చేసిన పాపము ఒక దినము నుండి ఒక నెల వరకు సరిపోవునదిగా ఉండును. దానివలన సంపాదించిన కాలము

తక్కువ, అనుభవించే కాలము ఎక్కువ అగుచున్నది. ఒక దొంగతనము చేస్తే అది చిన్న దొంగతనమునకు చిన్న పాపము, పెద్ద దొంగతనమునకు పెద్ద పాపము వచ్చియుండును. నీవు చేసిన పనివలన ఇతరులు అనుభవించిన క్షోభనుబట్టి పెద్ద చిన్న పాపముండును. నీవు రాజకీయములో ఇతరులను బాధించిన బాధలకు వారు కొన్ని సంవత్సరములు బాధపడి అనుభవించారు. నీవు అన్యాయముగా నీ అధికారముతో అమాయకున్ని పోలీస్ కేసులో ఇరికించుటకు నీకు ఒక గంటకాలము పట్టియుండును. అన్యాయముగా ఇరికించిన కేసునుండి బయటపడుటకు వానికి ఒక సంవత్సర కాలము పట్టినది. దీనినిబట్టి నీవు ఒక గంట చేసిన పనికి ఇతరులు ఒక సంవత్సరము బాధ అనుభవించారు, కావున నీకు వచ్చిన ఒక గంట పాపము సంవత్సరము రోజులు అనుభవించవలసి యుండును. ఇట్లు ఒక జన్మలో చేసుకొన్న ప్రపంచ కర్మ నాలుగు, ఐదు జన్మలకు సరిపోవునదిగా యున్నది. దానిని అంతకాలము అనుభవించ వలసినదే!

అయితే ప్రపంచ విషయములలో అనగా ప్రపంచ కర్మలలో మనుషులకు దేవుడు ఒక రాయితీ ప్రకటించాడు. ఎవడు ఎంత ప్రపంచ పాపమును చేసియున్నా అతను **"దేవుని జ్ఞానమును అనుసరించి, ఆచరించుట వలన వానికర్మయంతయూ కొట్టివేయబడును లేక క్షమించ బడును"** అని చెప్పియున్నాడు. ఈ విషయమును ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమందు 36, 37 శ్లోకములలో ఇట్లు చెప్పియున్నారు చూడండి...

*36వ శ్లో॥* అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥

**భావము :- "అఖిల పాపాత్ములందు నీవు ఎంత పెద్ద పాపము చేసిన వాడవైనా గానీ, మురికి సముద్రమును జ్ఞానము అను పడవతో దాటగలవు."**

37వ శ్లో॥ యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురు తేర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

**భావము :- "అగ్నిలో ఎన్ని కట్టెలైనా గానీ కాలి బూడిదయైనట్లు, జ్ఞానమను అగ్నిలో నీవు చేసుకొన్న సర్వకర్మలు అనుమానము లేకుండా కాలిపోవును."**

దేవుడు తన జ్ఞానములో చెప్పిన ప్రకారము మనిషి సంపాదించుకొన్న ప్రపంచ కర్మయంతయూ, అనుభవించకుండా తప్పించుకొను రాయితీ గలదు. మనిషి చేసిన ప్రతి పాపమును తప్పక అనుభవించవలసియుండును. అయితే 'దైవజ్ఞానమును తెలిసి, దానిని ఆచరించుట వలన మనిషి చేసుకొన్న పాపములన్నీ క్షమించబడునని' మూడు దైవగ్రంథములలో చెప్పియున్నాడు. అందువలన ఏ మతస్థునికయినా ఈ నియమము వర్తించును. అందువలన నీవు చేసుకొన్న ప్రపంచ సంబంధ పాపము ఎంత పెద్దదయినాగానీ, అది ఎంత చెడుదయినాగానీ ఒక్క దైవజ్ఞానము వలన తప్పించుకొను అవకాశమును దేవుడు కల్పించాడు. ఇప్పటికయినా నీవు చేసుకొన్న పాపములను తెలుసుకొని దైవజ్ఞానము చేత ప్రపంచ సంబంధ కర్మలనయినా లేకుండా చేసుకొనుటకు ప్రయత్నించమని ఈ లేఖ ద్వారా తెలియజేస్తున్నాను. మిమ్ములను మేల్కొలిపి చెప్పడము మా కర్తవ్యము. తర్వాత నీవు పాపమును లేకుండా చేసుకోవడము నీ పని. అయితే మేము మీకు ఇంతవరకు చెప్పినది హితోపదేశము, అయినా నీ బుద్ధి గ్రహించుకొను దానినిబట్టి నేను చెప్పినది మంచిగా అయినా కనిపించవచ్చును లేక చెడుగా అయినా కనిపించవచ్చును. నీలో గుణములు పని చేసి గర్వము చేత "నేనే గొప్ప నేను ఎవరో చెప్పిన మాటలెందుకు వినాలి?" అని అనుకొంటే

మేము ఏమీ చేయలేము. నీవు పాపమును అనుభవించినా, అనుభవించక పోయినా మాకు నష్టముగానీ లాభముగానీ ఉండదు. ఇంతవరకు చెప్పినది నీకు ఒక్కనికే కాదు, ఇదంతయూ లోకహితము కొరకని చెప్పుచున్నాము. నీ లేఖను చదివిన నీవు బాగుపడక పోయినా, ఇందులోని సారమును గ్రహించిన ఇతరులయినా పాపము ఎడల జాగ్రత్తగా ఉండగలరు.

ఒకవేళ నీవు నా మాటలను గ్రహించగలిగి ఇప్పటినుంచయినా దైవ మార్గములో ప్రయాణించగలిగితే, ఈ జన్మలో చేసుకొన్న పాపములు మరియు గత జన్మలలో చేసుకొన్న పాపములు (కర్మలు) లేకుండా పోగలవు. అయితే ఒక్క విషయమును బాగా జ్ఞాపకము పెట్టుకోవలెను. నీవు ఎంతో జ్ఞానము గలిగి దైవమార్గములో ప్రయాణిస్తూ, దైవసేవ చేయగలిగినా, నీవు సంపాదించుకొన్న ప్రపంచ కర్మలు మాత్రము జ్ఞానాగ్నిలో దహించబడి లేకుండా పోవును. అంతేగానీ నీవు చేసుకొన్న జ్ఞాన సంబంధ, దైవ సంబంధ పాపములు మాత్రము అలాగే మిగిలియుండును. జ్ఞానమునకు వ్యతిరేఖముగా వచ్చిన కర్మలను జ్ఞానము వలన పరిష్కారము కావు. జ్ఞానాగ్ని వాటిని కాల్చదు. ప్రపంచములోని అన్నిటినీ కాల్చు అగ్ని తనను తాను కాల్చుకోలేదు. అగ్నిలో ఏ వస్తువయినా కాల్చబడి లేకుండా పోవును. అయితే అగ్ని అగ్నిని కాల్చలేదు. ఇతరములను దహించి ప్రకాశించగల అగ్ని తనను తాను ఎలా కాల్చుకోలేదో, అలాగే జ్ఞాన సంబంధమైన పాపము లను జ్ఞానము లేకుండా చేయలేదు. **"జ్ఞాన వ్యతిరేఖ కర్మ ఏదయినా జ్ఞానము వలన తీసివేయబడదు లేక కాల్చివేయబడదు"** అని చెప్పవచ్చును. అందువలన గతములో తుచ్ఛ రాజకీయముల కొరకు చేసుకొన్న జ్ఞాన వ్యతిరేఖ పాపములు నీవు జ్ఞానివయినా లేకుండా పోవు. రెండు మరియు రెండు మొత్తము నాలుగు యుగముల పర్యంతము నిత్య పాపమును

అనుభవించవలసి యుండును. జ్ఞానవ్యతిరేఖ పాపములనుండి నీవు ఎటూ బయటపడలేవు, ప్రపంచ సంబంధ కర్మలనుండయినా బయటపడమని ఈ ఉత్తరము ద్వారా తెలుపుచున్నాము.

ఇట్లు
**ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

## మూడవ లేఖ

(సంసారివలెనున్న వ్యభిచారిణికి)

జీవాత్మ స్వరూపులయిన రేకుల అంకాలమ్మ వెంకమ్మ గారికి వ్రాయు ఉత్తరము ఏమనగా!

మీరు ఒకమారు నాతో కలిసి మాట్లాడడము జరిగినది. మీరు చెప్పినదంతా విన్నాము. మా వలన మీకు ఏదయినా మంచి జరుగుతుందేమో అని ఆశతో మీరు మీ కుటుంబ విషయములను, మీ స్వంత విషయములను మాకు చెప్పడము జరిగినది. మీరు చెప్పినవన్నీ నిజమేనని నేను అప్పుడు అనుకోవడమైనది. అయితే కొంతకాలము జరిగిన తర్వాత చెప్పిన మాటలన్నీ నిజము కాదని నాకు కొంత అర్థమయినది. మీ నాన్నగారు ఉద్యోగము చేస్తూ లంచాలు తీసుకోకుండా బ్రతికేవాడని చెప్పారు. అయితే తర్వాత నాకు తెలిసిన సత్యము ప్రకారము మీ నాన్నగారు మంచివారేగానీ మీరు అనగా మీ అమ్మ, నీవు ఇద్దరూ కలిసి లంచాలు తీసుకోమని చెప్పేడివారు. అతను చేయు ఉద్యోగములో ప్రతి దినము లంచము వలన వచ్చిన కొంత డబ్బయినా ఇంటిలో ఇవ్వవలెనని

వత్తిడి తెచ్చేవారు. మీ నాన్నగారు ఒక పోలీస్ స్టేషన్‌లో సబ్ ఇన్‌స్పెక్టర్‌గా పని చేయుచూ ఇంటిలో మీ పోరుపడలేక, లంచాలను తీసుకోలేక ఇబ్బంది పడేవాడు. ఒక దినము ఒక కేసుకు సంబంధించి పదివేలు లంచము తీసుకొని A.C.B అధికారులకు చిక్కిపోయి అవమానము పాలయినాడు. ఉద్యోగమునుండి సస్పెండ్ అయినాడు. అతడు మీ ప్రవర్తనను భరించలేక ఆత్మహత్య చేసుకొని చనిపోవడమైనది. ఆయన చనిపోగా ఉద్యోగము వలన వచ్చెడి డబ్బులన్నీ మీకు వచ్చాయి. మీ ఇంటిలో మగపిల్లవానికి ఉద్యోగము కూడా వచ్చినది. అతని జీతముతో కాలము గడుపుచున్న మీరు ఇంతవరకు మేము చేసిన పనికి మా నాన్నగారు చనిపోయాడని నీవు అనుకోలేదు, నా భర్త చనిపోయాడని మీ అమ్మ అనుకోలేదు. అంత జరిగినా మీలో మార్పు ఏమీ రాలేదు.

నీ తమ్ముడు ఉద్యోగము చేస్తూయుంటే అతని జీతముతో కాలము గడుపుచూ అతనికి పెళ్ళీడు వచ్చినా ఇంతవరకు పెళ్ళి చేయలేదు. వయస్సులో యున్న నీవు తప్పుదారి పట్టిపోయి ఇతర పురుషులతో అక్రమ సంబంధము పెట్టుకోవడము, వారి వలన డబ్బులు లాగడము చేయను మొదలుపెట్టావు. మీ అమ్మ కూడా అదే మంచిదన్నట్లు నిన్ను ప్రోత్సహించి నది. ఇట్లు రహస్యమంతనాలు చేస్తూ కొంత డబ్బులు సంపాదించు కోవడము జరిగినది. మేము ఎవరికీ తెలియకుండా చేసినది మీకెలా తెలిసినదని ఆశ్చర్యపోకండి. నాకెలా తెలిసినా నేను చెప్పునది మీ శ్రేయస్సు కొరకే అను విషయమును మరచిపోవద్దండి. మీరు నాతో కలిసినప్పుడు, నాతో మాట్లాడే అవకాశము వచ్చినప్పుడు, మీరు నాతో చెప్పిన అన్ని మాటలు పూర్తి అసత్యమని ఈ మధ్య కాలములో తెలిసినది. భూమిమీద ఇన్ని రకముల మనుషులున్నారను అనుభవము కూడా మాకు వచ్చినది.

మీ మాటలు వినిన తర్వాత మీకు మంచి చేయాలనుకొన్నాను. అలాగే మంచి కూడా చేయడమైనది. ఆ మంచితనము బూడిదలో పోసిన పన్నీరు లాగా వృథా అయిపోయినది.

మా దగ్గరకు వచ్చే వారందరూ భయభక్తులతో ఉంటారు. దురలవాట్లు లేనివారే మా దగ్గరకు వస్తుంటారు. బీడీ, సిగరెట్ త్రాగువారు కూడా మా ముందరకు రావాలంటే భయపడి దూరముగా ఉంటారు. మత్తు పాణీయములు త్రాగువారు ఎవరూ ఇక్కడికి రారు. ఒకవేళ ముందు మత్తు పాణీయముల అలవాట్లు యున్నవారు వాటన్నిటినీ వదలివేసి, పాత అలవాట్లన్నియూ మానుకొన్న తర్వాతనే మావద్దకు వస్తుందురు. అటువంటి పద్ధతి యున్న ఇక్కడికి మీరు రెండు మూడుమార్లు వచ్చారు. వచ్చినవారు ఇక్కడ పద్ధతులన్నీ చూచికూడా మాకు తెలియకుండా మీకు ఇచ్చిన రూములో మత్తుపాణీయములు త్రాగడము జరిగినది. మాకు తెలియదను కున్న విషయము తెలిసి మేము చెప్పగా, మా మనుషులు వచ్చి మిమ్ములను దండించడము కూడా జరిగినది. రూములో సారా వాసన వస్తుంది అని మా మనిషి అడిగితే మీరు త్రాగనట్లు అబద్ధమును చెప్పారు.

ఇంతకుముందే అనగా మీరు ఇక్కడికి రాకముందే అన్ని అలవాట్లు ఉండుట వలన, ఒకరోజు కూడా త్రాగుడు మానలేక త్రాగారని నాకు అర్థమయి నేనే స్వయముగా దండించడము జరిగినది. అప్పుడు కూడా నిజమును ఒప్పుకోకుండా మీ వెంట వచ్చిన ముసలి ఆయన త్రాగడము వలన వాసన వచ్చినదని అబద్ధమును చెప్పి సరిచేశారు. నీవు చెడు వృత్తి ఎవరికీ తెలియకుండా చేయుచూ, నీ చెల్లెలుకు కూడా అదే పనిని నేర్పించావు. పైగా నీకు పెళ్ళయినదనీ, భర్త వదలిపెట్టాడనీ, మాకు చెప్పావు. తర్వాత నీ చెల్లెలు పెళ్ళికొరకు ఇక్కడికి వచ్చానని, మంచి అబ్బాయిని

చూచి మీరే పెళ్ళి చేయమని అడిగావు. మీ అమ్మ, నీవు, నీ చెల్లెలు వచ్చి ఎంతో భక్తిగా నటిస్తూ అడిగారు. మీరు ఏ దిక్కు లేదని చెప్పి ప్రాధేయపడి అడిగారు. దానికి జాలిపడిన మేము నీ చెల్లెలుకు ఒక మంచి అబ్బాయిని చూపాము. పైసా కట్నము లేకుండా పెళ్ళి చేసుకొనునట్లు ఏర్పాటు చేశాము. మేము ఎంతో శ్రమించి ఒక అబ్బాయిని చూపి పెళ్ళి చేస్తే, వారము రోజులకే అబ్బాయి మీద తప్పుడు ఆరోపణలు చేసి, అతను మాకిష్టము లేదని చెప్పి వదలివేసి పోయారు. మీ ఇద్దరు అక్క చెల్లెంద్రకు త్రాగుడు అలవాటున్నట్లు మాకు తెలిసినది. అప్పటినుండి మిమ్ములను ఇక్కడికి రానివ్వడములేదు.

ఇంతవరకు మీరు చేసిన తప్పులను చెప్పాము. మీకు జ్ఞానము మీద ఆసక్తి లేకున్ననూ భక్తి శ్రద్ధలున్నట్లు నటించుచూ ఇక్కడికి వచ్చారు. మీ నటనకు మేము మోసపోయి జ్ఞానము మీద శ్రద్ధ ఉందేమోనని అనుకొన్నాము. మీరు మా దగ్గరకు వచ్చినది ప్రపంచ సంబంధమైన విషయము కొరకు, నీ చెల్లెలుకు అక్కడ మీ ఊరిలో పెళ్ళికాదని తెలిసి ఇక్కడ కుదురుతుందని వచ్చారు. నన్ను జ్ఞానములో ఇబ్బంది పెట్టలేదు. మీ దృష్ఠి అంతయూ ప్రపంచ మేలుకొరకే యుండుట వలన, ఇది జ్ఞాన సంబంధమైన విషయమే కాదు. జ్ఞానము యొక్క విలువ తెలియదు కావున, ఎక్కడ ఎట్లు నడుచుకోవాలని తెలియక మీ దురలవాట్లను మీరు ఇక్కడ కూడా మానలేదు. అలా ఇక్కడికి వచ్చి మాకు తెలియకుండా మత్తు పాణీయములు త్రాగియుండడము, పెళ్ళి చేస్తే ఏడు రోజులకే భర్తను వదలివేయడము, మాతోనే అసత్యములు చెప్పడము, మీ అమ్మ నీవు కలిసి మీ నాన్నను లంచాలు తీసుకోమని వేధించడము, మొదలగు కార్యము లన్నియూ ప్రపంచ సంబంధమైనవే అగుట వలన, నీకు ప్రపంచ

సంబంధమైన పాపమే వచ్చియున్నది. మీరు చేసినది అన్నీ తప్పుపనులే అయివుండుట వలన పాపమే వచ్చినదని చెప్పవచ్చును. మా వద్దకే వచ్చి దయ కల్గునట్లు చెప్పి మా చేతనే పెళ్ళికి వరున్ని చూచుకొన్నారు. మేము మీకు చేసినది కూడా అంతయూ ప్రపంచ సంబంధమైన సహాయమే అగుట వలన మీ ముగ్గురికి పాపమే వచ్చినది. మీ ముగ్గురిలో నీది ఒక్కదానిదే ఎక్కువ పాత్రయుండుట వలన మీ అమ్మకంటే, నీ చెల్లెలుకంటే ఎక్కువ పాపము నీకే వచ్చినదని చెప్పవచ్చును.

చేసినది ప్రపంచ సంబంధమైన తప్పిదములయినందున వచ్చిన పాపము కూడా ప్రపంచ సంబంధమైనదే. అందువలన అది ఎంత పెద్ద పాపమయినా దైవజ్ఞానము చేత క్షమార్హమైనదేయని చెప్పవచ్చును. ఒకవేళ ఇక్కడ మా జ్ఞానమునకు గానీ, దైవ విషయములకుగానీ ఏదయినా కష్టము నష్టము తెచ్చియుంటే క్షమించరాని పాపము వచ్చెడిది. అలా జరుగలేదు, ఎంత వ్యభిచారము చేసినా, భర్తను వదలి వెళ్ళినా, లంచములతో ఇతరులను పీడించినా ఇవన్నియూ ప్రపంచ సంబంధ విషయములే అగును. అందువలన వాటి ద్వారా వచ్చిన పాపము కూడా ప్రపంచ సంబంధమే అయివుండును. వచ్చిన పాపము క్షమించరానిది కాదు, కావున మీరు ఇప్పటికయినా దేవునిమీద, దేవుని జ్ఞానము మీద ధ్యాస కలిగి, దేవుని జ్ఞానము ప్రకారము నడుచుకోగలిగితే కొంత కాలమునకు మీరు చేసుకొన్న కర్మంతయూ పూర్తిగా లేకుండా పోగలదు. దైవజ్ఞానములో యున్న శక్తి మనుషులు తెలిసో, తెలియకో చేసుకొన్న పాపములను లేకుండా చేయగలదు. అనగా జ్ఞానము అగ్నియై పాపమను కట్టెలను కాల్చివేయును. ఈ విషయము యొక్క నమూనానే బయట యజ్ఞములను చేసి చూపుచుందురు. యజ్ఞ గుండములో మండే అగ్ని జ్ఞానము అనియూ, కాలిపోయే సమిధలు మనము

సంపాదించుకొన్న కర్మలనియూ అర్థము చేసుకొనునట్లు యజ్ఞక్రియ కొనసాగుచున్నది. ఆ విధముగా యజ్ఞ సంబంధముగా కార్యములను చేయవలెనని భగవద్గీతలో చెప్పడమైనది. ఆ విషయమును తెలియనివారు ఇప్పుడయినా తెలియగలిగి, మీరు చేసుకొన్న పాప కర్మలను జ్ఞానాగ్నిలో కాల్చివేసుకోవచ్చును. అలా పాప విముక్తి పొందాలంటే, మీరు చేసిన చెడులన్నీ తొలిగిపోవాలంటే ముందు మీరు దైవజ్ఞానమును తెలియవలసి యుంటుంది.

ఆడవారమను బిడియము కూడా లేకుండా ఆశ్రమానికి వచ్చినపుడు కూడా మత్తుపాణీయములు త్రాగిన మీకు మా మాటలు రుచించునను నమ్మకములేదు. చెప్పవలసిన బాధ్యత మాకున్నది కావున నేను చెప్పడమైనది. ఒక ఆశ్రమమునకు స్వామీజీవద్దకు వచ్చినప్పుడే మీరు మీ జీవితములో మార్పు తెచ్చుకొనియుంటే సులభముగా దైవజ్ఞానము అర్థమయ్యేడిది. మీరు కొంత కూడా మారలేదు, కావున ఇప్పుడు మార్పు వస్తుందని మేము అనుకోవడము లేదు. మనిషి తప్పులు చేయవచ్చును, అయితే చేసిన తప్పులను సవరించుకొను విధానమును కూడా మనిషికి ఇవ్వడమైనది. దేవుడిచ్చిన అవకాశమును కొందరు వినియోగించుకొని వారి కర్మల నుండి బయటపడుచున్నారు. దేవుని జ్ఞానము మనిషికి అర్థమయినప్పుడు అతడు ఎంత పాపియైనాగానీ, వాని పాపములు క్షమించ బడునని దేవుడు చెప్పియున్నాడు. మీరు చేసినది ప్రపంచ పాపమే అయినందున మీరు పాపక్షమాపణ పొందు అవకాశము గలదు. మీరు దేవుని జ్ఞానము తెలిసినప్పుడే, మీ పాపము దహించివేయబడును. జ్ఞానము తెలియాలంటే జ్ఞానము మీద శ్రద్ధ ఉండవలెను. శ్రద్ధలేని వారికి దైవజ్ఞానము లభించదు. మనిషికి శ్రద్ధ కలగాలంటే అది ప్రకృతి జనితమైన 'మాయ'

చేతిలో ఉంటుంది. మాయ దేవునికి అనుకూలమైనది, మనిషికి ప్రతికూలమైనది. దేవుని జ్ఞానము లభించు ఆశ్రమాల మీద, జ్ఞానమునే బోధించు గురువుల మీద గౌరవము లేనివారికి దేవునివైపు పంపకుండా మాయ ఆటంకపరచగలదు. అందువలన మీరు జ్ఞాననిలయమైన స్వామీజీ దగ్గరకు పోయి, అక్కడ కూడా భయము లేకుండా త్రాగిన మిమ్ములను మాయ దేవునివైపు పోకుండా చేయగలదు. దేవుని జ్ఞానము మీద శ్రద్ధను కలుగకుండా మాయ చేయుట వలన, శ్రద్ధ లేనివారికి జ్ఞానము కలుగదు. జ్ఞానము కలుగని వారిలో జ్ఞానశక్తియుండదు. జ్ఞానశక్తి లేనిది మీ కర్మలు కాలవు. అందువలన మీలాంటి వారు జన్మ జన్మకు జ్ఞానమునకు దూరముగా పోవుచుందురని భగవద్గీతలో దైవాసుర సంపద్విభాగ యోగమున 19, 20 శ్లోకములలో చెప్పబడియున్నది. ఇదంతయూ మీ మంచి కోరి చెప్పాను. ఇప్పటికయినా మీరు మార్పుచెంది దేవుడే దిక్కని నమ్మితే ప్రకృతి (మాయ) మిమ్ములను ఆటంకపరుచదు. ఇంతకంటే ఎక్కువ చెప్పలేను.

ఇట్లు

**ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**




(కర్షకునికి అనగా వ్యవసాయమును చేయువానికి)

జీవాత్మయైన సోమయ్య అను కర్షకునకు నేను వ్రాయు లేఖ ఏమనగా!

మీ క్షేమమే నా క్షేమముగా తలచిన నేను మీ జ్ఞానమునే నా జ్ఞానముగా తలచుచూ నావలె మీరు జ్ఞానులు కావలెనని కోరుచూ ఈ

ఉత్తరమును వ్రాయుచున్నాను. నీ పేరు సోమయ్య, నీ పేరులోనే జ్ఞానమున్నది. 'సోమ' అనగా 'చంద్ర' అనియూ, 'సోముడు' అనగా 'చంద్రుడు' అని అర్థము గలదు. చంద్రుడు అనగా జ్ఞానము గలవాడని, జ్ఞాన నిలయుడని అర్థము. నీ పేరుకు తగినట్లు నీవు జ్ఞానిగా యుండవలెనని కోరుచున్నాను. నీకు సోమయ్య అను పేరున్నా లేకున్నా నీవు నీ వృత్తిరీత్యా కర్షకునివి. **'కర్షకుడు'** అను పదము పూర్వము **'హర్షకుడు'** అను పదమునుండి మార్పు చెందుచూ వచ్చి కర్షకుడయినది. బాగా గమనించితే "క" అను అక్షరములోని శబ్దములో చివరగా పలుకబడు శబ్దము 'అ' అనియే తెలియుచున్నది. 'క'లో 'అ' ఉండుట వలన కర్షకుడన్నా హర్షకుడన్నా ఒక్కటే యగును. కృతయుగములో 'కర్షకుడు' అను పదము 'హర్షకుడు'గానే పిలువబడెడిది, కావున కర్షకుడు అను పదమునకు అర్థమును చెప్పుకొంటే ఈ విధముగా గలదు.

**'హర్షము'** అనగా **'ఆనందము'** అని అర్థము. 'హర్షకుడు' అనగా 'సంతోషము గలవాడు' అని చెప్పవచ్చును. నేడు కర్షకుడు అని పిలువబడినా అర్థము మాత్రము హర్షకునిగానే చెప్పుకోవలసియుండును. పూర్వము ప్రతి కర్షకుడు హర్షమును పొందువానిగానే యుండెడివాడు. కర్షకుడు సంతోషముగా యుండుటకు కారణము 'వానికి అందు సహాయము' అనియే చెప్పవచ్చును. ప్రతి కర్షకునకు దేవునినుండి ప్రతి సంవత్సరము సహాయమందెడిది. అప్పుడు నెలకు మూడు వానలు కురిసేవి. సంవత్సరమునకు రెండు పంటలు పండేవి. పంటలలో విపరీతమైన సహాయము అందెడిది. మొదట రైతు తన గింజలను పొలములో చల్లి ఖర్చు చేయును. తన గింజలను మట్టిలో పారపోయగా దానిని ఖర్చు అంటున్నాము కదా! ఖర్చును 'వ్యయము' అను పదముతో చెప్పవచ్చును.

అలా వ్యయము చేసిన తర్వాత మూడు నెలలకు అవే గింజలు పంటరూపములో తిరిగి ఎన్నోరెట్లు ఎక్కువగా వచ్చుట వలన దానిని దేవుడు చేసిన సహాయము లేక సాయము అని అంటున్నాము. ఒక రైతు ముందు తన గింజలను ఖర్చుచేసి తర్వాత లాభమును సహాయ రూపములో పొందుచున్నాడు, కావున ఆ వ్యవహారమును అంతటినీ కలిపి 'వ్యయసాయము' అని అన్నారు. వ్యయము చేసిన ప్రతివాడు సాయము పొందుట వలన ప్రతి రైతు సంతోషముగా యుండెడివాడు. సంతోషముగా యుండుట వలన ప్రతి రైతును 'హర్షకుడు' అని అన్నారు. ఆ పదమే నేడు 'కర్షకుడు'గా చెప్పబడుచున్నది.

కాలక్రమమున కర్షకుడుగా మారిన హర్షకుడు తన పేరుకు తగినట్లు సంతోషముగా లేకుండా పోవుచున్నాడు. హర్షకుడుగా ఉండవలసిన వాడు అనగా సంతోషముగా ఉండవలసినవాడు అలా లేకుండా పోవుటకు తెరవెనుక కారణము కర్మయేనని చెప్పవచ్చును. పూర్వము రైతుగా యున్నవాడు మంచి పంటల లాభము పొందుచుండుట వలన దేవుడు చేసిన సాయమునకు సంతోషముగా ఉంటూ ఇతర పాపము వచ్చే పనులు చేసెడివాడు కాదు. ఎల్లప్పుడూ సంతోషముగా యుండుట వలన రైతు మంచిపనులే చేసెడివాడు. ఇతరులకు బాధను కలిగించు పాపపు పనిని చేసెడివాడు కాదు. ఇతరులకు మంచిని చేయువాడుగా పూర్వము రైతులుండుట వలన రైతుకు పుణ్యమే వచ్చెడిది, కలియుగము వచ్చిన తర్వాత రైతు అయిన కర్షకుడు గుణముల ప్రభావము వలన కఠినుడుగా మారిపోయి ఇతరుల ఉద్ధరించువాడు కాకుండా ఇతరులను వేధించువానిగా మారిపోయాడు. ఇతరులను వేధించుట వలన రైతు కూడా పాపముతో కూడుకొన్నవాడైపోయాడు.

కలియుగములో వర్షములు రావడము తగ్గిపోయాయి. దానివలన అక్కడక్కడ కొన్నిచోట్ల మాత్రము కరువు ఛాయలు కనిపించేవి. కరువు వచ్చిన ప్రాంతములో గల రైతులు ప్రస్తుతానికి పొలము పని ఆపివేసి ఇతర పనుల మీద ఆధారపడెడివారు. అట్లు ఇతర పనులు చేయడములో తన ఆదాయము కొరకు కొన్ని పాపపు పనులనే చేయవలసి వచ్చుచున్నది. పంట పండనప్పుడు రైతు ఇతర మార్గములో తనకు లాభము వచ్చునట్లు చేసుకోవలసి యుండుట వలన, తాను చేయు పనులలో కొన్ని పనులు ఇతరుల డబ్బును లాగుకొనునట్లు, తనకు లాభము వచ్చునట్లు యుండుట వలన అది పాపపు పనియే అగుచున్నది. దేవుడిచ్చు సాయము లేనప్పుడు అనగా వ్యయసాయము లేనప్పుడు, ఇతర వ్యాపకమైన పనులను చేయ వలసి యుండుట వలన, ఆ పనులు ఇతరుల సొమ్మును కాజేయునవిగా ఉండుట వలన, వాటి వలన పాపమే వచ్చుచున్నది. ఈ విధముగా రైతు పాప కార్యములలో యుండుట వలన పాపమే తిరిగి అనుభవమునకు వచ్చి, రైతు కష్టములనే అనుభవించవలసియున్నది. రైతు పాపమును అనుభవించ వలెనంటే అతనికి సహాయము అందకూడదు. అందువలన నేడు పంటలు పండడము లేదు. రైతు సుఖముగా ఉండుట లేదు. హర్షకుడు అను పేరు రైతుకు వర్తించడము లేదు. నేడు రైతు అనబడు కర్షకుడు పాపఫలితము వలన హర్షకునిగా కాకుండా కర్షకుడు గానే మిగిలిపోయాడు. హర్షకుడు కర్షకునిగా మారినట్లు 'వ్యయసాయము' అను పదము 'వ్యవసాయముగా' మారిపోయినది. హర్షకుడు స్థానములో 'హ' కు బదులు 'క' అను అక్షరము వచ్చినట్లు వ్యయసాయము అను పదములో "య" అను అక్షరము పోయి "వ" వచ్చి చేరి 'వ్యయసాయము' అను పదము బదులు 'వ్యవసాయము' అను పదము వచ్చినది. నేడు వ్యయసాయము

అను పదము బదులు వ్యవసాయము అను అర్థము లేని మాటను పలుకుచున్నామని చాలామంది రైతులకే తెలియకుండా పోయినది.

మర్యాద సోమయ్యా! నీవు చేయునది వ్యయసాయమా, వ్యవసాయమా? అని ప్రశ్నిస్తే జవాబు చెప్పలేని పరిస్థితి ఏర్పడుచున్నది. ఇప్పటికాలములో వ్యవసాయమే అని అందరము అంటున్నాము తప్ప "వ్యయసాయము" అని ఎవరూ అనడము లేదు. అందువలన నీకు తెలియకుండా పోయిన 'వ్యయసాయము' అను పదమునకు అర్థము తెలియు లాగా మరియు 'హర్షకుడు' అను పదమునకు వివరము తెలియులాగా ఈ ఉత్తరమును వ్రాయుచున్నాను. ఈ ఉత్తరములో నీవు ఉత్తరమువైపు పోవునట్లు చేయుటే మా ధ్యేయమయిన దానివలన గతములో నీవు చేసిన పాపపు పనులను ఎత్తి చూపి, తర్వాత అటువంటి పాపమును చేయనట్లు మంచి మార్గములో పోవునట్లు మంచి సూక్తులను బోధించడమే ఈ లేఖలోని సారాంశము.

మీ ఇంటి పేరు మర్యాద, నీ పేరు సోమయ్య, అయితే నీ ఇంటి పేరుకు తగినట్లు నీవు బయట ప్రపంచములో మర్యాద సంపాదించుకోలేదు. అట్లే నీ పేరుకు తగినట్లు ఏమాత్రము జ్ఞానమునకు సంబంధము లేకుండా బ్రతికావు. ఇంటి పేరు గౌరవమయినది, నీ పేరు జ్ఞానవంతమయినది. అయినా నీ జీవితము అగౌరవముగా, అజ్ఞానముగా సాగినది. నీ చిన్నప్పుడే నీ తండ్రి చనిపోయాడు. అప్పటికే నీకు నలుగురు తమ్ముళ్ళున్నారు. మీ తండ్రి చనిపోయిన తర్వాత మీ అమ్మగారు ఎంతో శ్రమపడి మిమ్ములను పోషించినది. మీ ఊరిలో అందరూ మంచిగా పొలమున్న రైతులేయున్నారు. మీది చిన్న గ్రామము, మీ ఊరిలో నీ చిన్నప్పుడు దాదాపు యాభైనుండి అరవై ఇళ్ళ వరకు ఉండేవి. కేవలము పది కుటుంబముల వారికి మాత్రము

వంద ఎకరములకంటే తక్కువ భూమియున్నది. మిగతా వారందరికీ వందనుండి ఎక్కువ ఎకరముల భూమియున్నది. మీ కుటుంబమునకు మాత్రము కేవలము ఇరవై (20) ఎకరముల భూమి మాత్రము ఉండేది. నీవు పెరిగి పెద్దయిన తర్వాత నీ పెళ్ళి కాకముందే మీ అమ్మకూడా చనిపోయినది. నీకు ఇరవై ఐదు సంవత్సరముల వయస్సులో మీ అమ్మ చనిపోయినది. అప్పటికి నీ చిన్నతమ్ముని వయస్సు 14 సంవత్సరములు. ఇంటిలో నీవే పెద్ద అయిన దానివలన అంతా నీ పెత్తనమే జరిగేది. నీవు ఎక్కువగా మిగతా నలుగురు తమ్ముళ్ళతో పని చేయించే వానివి. నీ చిన్న తమ్ముడు పనిచేయలేక అలసిపోయెడివాడు. పిల్లవాడని, పైగా తమ్ముడని దయలేకుండా పని చేయలేకపోతే అన్నము కూడా పెట్టే వానివి కాదు. నీవు కఠినముగా చూడడము వలన నలుగురు తమ్ముళ్ళు చాలా బాధపడెడి వారు. ఒక సంవత్సరము బాధలు పడిన నీ చిన్నతమ్ముడు ఇల్లు వదలి పారిపోయాడు. 15 సంవత్సరముల వయస్సులో పారిపోయిన నీ తమ్ముని్న గురించి నీవు ఏమాత్రము వెతుకలేదు. పోయినవాడు తిరిగి ఇంటికి రాలేదు. అప్పటికి ముగ్గురు తమ్ముళ్ళే మిగిలిపోయారు. నీతో కూడి నలుగురైనారు. మొదట ఐదుమందియుండుట వలన మీకున్న 20 ఎకరముల భూమిని పంచుకుంటే తలా నాలుగు (4) ఎకరములు వచ్చేది. ఇప్పుడు ఒకడు ఇల్లు విడిచిపోయిన దానివలన ఒక్కొక్కరికి ఐదు (5) ఎకరములు వచ్చే అవకాశమున్నదని, చిన్నతమ్ముడు పోయిందే మంచిదని అనుకున్నావు. మిగిలిన ముగ్గురు తమ్ముళ్ళలో ఒకడు తెలివి తక్కువ వాడు. ఒకడు మంచి శరీరదారుఢ్యము కలవాడు. ఒకడు మంచి తెలివైనవాడు. నీ తమ్ముళ్ళలో నాల్గవ తమ్ముడు పారిపోగా మూడవ తమ్ముడు శరీర దారుఢ్యము గలవాడు అందరికంటే బాగా పని చేసెడివాడు. మూడవ

తమ్ముడు బాగా పనిచేస్తున్నాడని అనుకోకుండా, వాడు కూడా లేకుండా పోతే అతని భూమి కూడా నా వాటాకు వచ్చును కదా!యని నీవు ఆలోచించసాగావు. కొద్దిపాటి ఆస్తికొరకు నీలో "ఆశ" అను గుణము చెలరేగగా, దానికి తోడు 'అసూయ' కూడా తోడై నీలో బుద్ధి పూర్తి చెడు యోచనలు చేయను మొదలుపెట్టినది.

ఇంతకు మునుపు ఒక తమ్ముని్న అన్యాయముగా ఇల్లు వదలి పోవునట్లు చేశావు. నీవు నీ తెలివితో చేశానని అనుకోవడము వలన నీ తమ్ముని్న పారిపోయినట్లు చేసిన పాపము నిన్ను చేరినది. సాధారణముగా వచ్చే ఆస్తికంటే నీ తమ్ముడు పోయిన దానివలన ఒక ఎకరా భూమి ఎక్కువ వస్తుందని తలచావు. ఒక ఎకరా కనిపించేదయినా, కనిపించని పాపము నీ భావమునుబట్టి వంద ఎకరాలంత వచ్చినదని నీకు తెలియదు. కనిపించేదానిని చూచి నీవు సంతోషపడినావు. కనపరాని ఫలితము వలన ఎంత బాధపడవలసియుంటుందో నీకు తెలియదు. అదే ఎంతో పాపముండగా క్రొత్తగా మరొక పాపమునకు మొదలు పెట్టావు. మూడవ తమ్ముని్న ఎలాగయినా లేకుండా చేయాలనుకొన్నావు. చివరికి అతని్న చంపివేయాలను దుష్టబుద్ధి నీలో వచ్చినది. ఎంతో తెలివిగా కొబ్బరికాయ తీర్థములో విషమును కలిపి ఇచ్చావు. పూజలో వచ్చిన దేవుని ప్రసాదముగా తీర్థమును తీసుకొన్న నీ మూడవ తమ్ముడు చనిపోయాడు. ఏదో రోగము వలన చనిపోయాడని ప్రచారము చేశావు. ఇట్లు హత్యాపాపము నిన్ను చుట్టుముట్టినది. కొంత ఆస్తి కొరకు నీచాతినీచముగా ఒక తల్లికి పుట్టామను ధ్యాస కూడా లేకుండా, జంతువులకంటే నీచముగా ప్రవర్తించి స్వంత తమ్ముని్న చంపిన పాపాత్ముడవు నీవు. నీవు ఎంత నీచుడవో ఇతరులకు తెలియదు.

మూడవ తమ్ముని్న చంపిన తర్వాత నీ నిజరూపము తెలియక ఎవరో అమ్మాయిని ఇవ్వగా నీకు పెళ్ళయినది. అప్పటికాలములో ఆడపిల్లలు దొరకక చాలామంది పెళ్ళికాని వారిగా ఉండిపోయెడివారు. నీ అదృష్టము కొద్దీ మంచి అమ్మాయి దొరికింది. నీవు ఒక్కనివి ఆలస్యముగా పెళ్ళి చేసుకున్నావు. అయితే నీ మిగతా ఇద్దరి తమ్ముళ్ళకు పెళ్ళి చేయాలను ప్రయత్నము నీవు చేయలేదు. మిగిలిన ఇద్దరు తమ్ముళ్ళలో మొదటి తమ్ముడు తెలివైనవాడు. రెండవ వాడు తెలివి తక్కువ వాడు. తర్వాత నీ రెండవ తమ్ముని మీద నీ దృష్టి ప్రాకినది. మీ ఊరిలోకి వచ్చిన ఒక సాధువును మీ ఇంటికి వచ్చునట్లు చేసుకొన్నావు. ఆ సాధువుతో బాగా పరిచయము ఏర్పడిన తర్వాత నీ రెండవ తమ్ముని్న సాధువుకు శిష్యునిగా చేశావు. ఒంటరిగా తిరుగుచున్న సాధువుకు శిష్యుడు దొరికినందుకు సంతోషమయి నది. తర్వాత కొంత కాలమునకు గురువుతో పాటు శిష్యుడన్నట్లు రెండవ తమ్ముడు కూడా సాధువువెంట పోవడము జరిగినది. ఇంటివద్ద పనిచేయుట కంటే గురువువద్ద (సాధువువద్ద) యుంటే పని చేయకున్నా భోజనము దొరుకునని తలచిన తెలివి తక్కువ వాడు ఇదే బాగున్నదని సాధువు వెంట పోయాడు. అంతటితో నీ వద్ద ఒకటవ తమ్ముడు మాత్రము మిగిలాడు.

ఇద్దరు ఉన్న ఆస్తిని పంచుకొంటే ఒక్కొక్కరికి పది ఎకరముల భూమి వచ్చును. అయితే నీ బుద్ధి చెడు యోచనే చేయుట వలన ఒకటవ తమ్ముడు కూడా లేకుండా పోతే భూమి అంతా నాకు ఒక్కనికే వచ్చునని అనుకొనసాగావు. అప్పటి కాలములో భారతదేశములో బ్రిటీష్ పరిపాలన సాగెడిది. సైనికుల కొరకు సైనికాధికారులే పల్లెలలోనికి వచ్చి మిలిటరీ లోనికి సైనికులుగా చేర్చుకొనెడివారు. కొన్నిచోట్ల రానని చెప్పినవారిని బలవంతముగా కూడా తీసుకపోయెడివారు. ఒక దినము మిలిటరీ

అధికారులు మీ ఊరిలోనికి సైనికుల సెలక్షన్‌కు వచ్చి వారి కంటికి దృఢకాయులుగా కనిపించిన వారందరినీ బలవంతముగా సైన్యములో చేర్చుకొనుచుండిరి. అదే అదనుగా భావించిన నీవు నీ తమ్మున్ని సైన్యము లోనికి పోవునట్లు చేశావు. మిలటరీ అధికారులకు నీ తమ్మున్ని చూపడము వలన వారు అతనిని తీసుకొనిపోయారు. ఇట్లు మొదటి తమ్మున్ని కూడా అక్కడ లేకుండా చేశావు. మొదటి తమ్ముడు కొంత తెలివైనవాడు కావున ఆ పల్లెటూరిలో ఉండుటకంటే మిలిటరీలో చేరి సులభముగా ఉండవచ్చునని సంతోషముగా సైన్యములో చేరిపోయాడు. అంతటితో 20 ఎకరముల పొలమును నీవే అనుభవించుటకు ఏ ఆటంకము లేకుండా పోయినది. ఈ విధముగా నీ చెడు యోచనల వలన నలుగురు తమ్ముళ్ళ భూమిని నీవు ఒక్కనివే ఆక్రమించుకోవడము జరిగినది. అయితే ఈ కార్యముల వెనుక దాగియున్న పాపము ఎంత అని మాత్రము నీకు తెలియదు. ఇదంతయూ ప్రపంచ సంబంధమైన కార్యములే అయినందున ప్రపంచ సంబంధ పాపమే సంభవించినది. ఇప్పుడు నీ వయస్సు 95 సంవత్సరములు. నీ తముళ్ళ భూమిని నీవు సంపాదించి నాలుగు నుండి ఇరవై ఎకరాలను సంపాదించగలి గావు.

నీవు పుట్టినప్పుడు మీ కుటుంబమునకు మొత్తము 20 ఎకరముల భూమియుండగా ఇప్పుడు నీవు ఒక్కనివే ఆ భూమిని అంతటినీ ఆక్రమించ గలిగావు. ఇది నీ కుటుంబములో నీవు సంపాదించిన అక్రమాస్తి. బయట వ్యవహారములో కూడా మిగతావారిని ఏదో ఒక రకముగా మోసము చేసి భూమిని సంపాదించగలిగావు. 150 ఎకరముల భూమిగల ఒక యజమాని ఊరు వదలి వ్యాపార నిమిత్తము పెద్ద నగరానికి పోయాడు. చదువుకొన్న వాడయినందున విదేశములకు పోయి వ్యాపారము చేసి దండిగా

సంపాదించుకోగలిగి స్వంత ఊరికి రావడమే లేదు. అందువలన తన 150 ఎకరముల భూమిని గుత్తకు ఇచ్చాడు. ఊరిలో తక్కువ భూమిగలవాడివి నీవే అయినందున నీవు అడిగిన వెంటనే భూమిని గుత్తకు ఇవ్వడము జరిగినది. అతి తక్కువ గుత్తకు తీసుకొన్న నీవు 150 ఎకరములలో పండించుకొనుచూ గుత్తను మాత్రము సరిగా ఎప్పుడూ అతనికి ఇవ్వలేదు. పంట పండలేదని చెప్పేవానివి. భూమి యజమానికి వ్యాపారములో ఎక్కువ లాభములు వచ్చుట వలన భూమి విషయమును అతను కూడా శ్రద్ధగా పట్టించుకోలేదు. భూమి బీడుగా ఉండక సాగు అయితే చాలులే, గుత్త రాకపోయినా ఫరవాలేదు అనుకొన్నాడు. అతని ఉద్దేశ్యమును గ్రహించిన నీవు ఐదు సంవత్సరములకు ఒకమారు కూడా గుత్త సరిగా ఇవ్వలేదు.

అంతటితో ఆగక ప్రక్క పొలముల వారితో తగాదాలు ఉన్నాయని అతనిని నమ్మించి భూమిని అమ్మడమే మంచిదని చెప్పావు. నీ మాట విని అతను తన భూమినంతటినీ అమ్మాలనుకొన్నాడు. అప్పుడు భూమి రేటు అతనికి తక్కువ చెప్పి ఒప్పించి దానికి నాలుగింతలుగా నీవు అమ్ముకొన్నావు. అలా 50 ఎకరముల భూమిని అమ్మించి ఆ భూమిని అమ్మినప్పుడు మిగిలిన లాభముతో అతని 100 ఎకరములను నీవే కొన్నావు. ఇట్లు అక్రమముగా నూరు ఎకరములను సంపాదించావు. ఎన్నో సంవత్సరముల నుండి గుత్త విషయములో మోసము చేయడమేకాక భూమిని అనవసరముగా అమ్మునట్లు చేసి అందులో లాభముగా నూరు ఎకరములను దోచుకొన్నావు. ఈ విధముగా బయట ప్రపంచములో మోసము చేశావు. అంతేకాక స్వంత బంధువులను కూడా మోసము చేసి పది ఎకరముల పొలమును సంపాదించావు. భార్య తరపున బంధువులకు అనగా భార్య అక్కగారికి

మీ ఊరిలోనే పది ఎకరముల భూమిని కొనునట్లు చేశావు. వారు కొనిన భూమిని కోరుకుగానీ, గుత్తకుగానీ (కౌలుకు) నీవే చేశావు. వారికి కూడా ప్రతి సంవత్సరము పంట పండలేదని చెప్పావు. ఆ భూమిమీద బ్యాంకులో లోను తీసుకొనునట్లు చేసి వచ్చిన డబ్బును నీవే తీసుకొని చేను గట్టులు సరి చేయించాలని, భూమిని లెవల్ చేయాలని డబ్బులు దానికి సరిపోతాయని చెప్పావు. ఆ పనులు ఏమీ చేయకుండానే డబ్బులను మ్రింగేశావు. చివరికి వారితో కూడా భూమిని అమ్మునట్లు చేశావు, ఎవరూ కొనరని చెప్పి తక్కువ ధరకు కొన్నదానిలో సగము ధరకే నీవు తీసుకొన్నావు. ఆ డబ్బులను ఇవ్వకుండా వారికి ఎగనామము పెట్టావు.

ఈ విధముగా నీవు నీ జీవితమంతా పాపము సంపాదించుకోవడమే సరిపోయినది. నీ జీవితము మొత్తము ఒక పెద్ద పాపముల పుట్ట అయినది. ప్రపంచ విషయములలోనే పాపములను సంపాదించుకొన్న నీవు దైవికముగా ఏ పాపము చేయలేదు. "నలుగురితో పాటు నారాయణ" అన్నట్లు అందరూ చేసిన పూజలు చేసి, అందరూ గుడులకు పోయినట్లు పోయెడివాడివి. దేవుడంటే భయము ఉన్నదానివలన దేవుని సొమ్మును మాత్రము వదలివేశావు. మనుషులలో తనవాడు పరాయివాడు అను భేదము లేకుండా మోసము చేయగలిగావు. నీవు చేసిన ప్రతి పనికి లెక్క ప్రకారము కర్మను లెక్కించి వ్రాసిపెట్టినవాడు నీ శరీరములోనే గలడు. నీవు చేసిన మోసములు ఎవరికీ తెలియవని అనుకొన్నావు. నీకు తెలియకుండా నీలోనేయుండి నీవు చేసిన ప్రతి పనిని లెక్కించువాడున్నాడని నీకు తెలియదు. ఇప్పుడు నీవు చావుకు దగ్గరగాయున్నావు. ఇప్పటికే 95 సంవత్సరములు గడచి పోయాయి. ఇక నీవు బ్రతికితే ఒక సంవత్సరము లేకపోతే అంతకంటే తక్కువ కొన్ని నెలలు మాత్రమే!

నీ జీవిత చివరి అంచులో నేను నీకు ఉత్తరము వ్రాయడము జరిగినది. నా ఉత్తరము వలన నీవు చేసినదంతా పాపమేనని నీకు గుర్తు చేయడమైనది. దేవుడు తన ప్రథమ గ్రంథమయిన భగవద్గీతలో జ్ఞాన యోగము 36, 37 శ్లోకములలో చెప్పినట్లు నీ పాపమును క్షమించగలడు. నీవు చేసినది ఘోరమైన పాపమే మనుషులయితే నీ మీద కక్ష తీర్చుకోవాలను కొంటారు. భగవద్గీతను చెప్పినవాడు మనిషికాడు, దేవుడే ఆ విషయమును ప్రకటించడము వలన మనుషులవలె కక్ష తీర్చుకొను భావము లేకుండా నీవు చేసిన ప్రతి పాపమును జ్ఞానమువలన లేకుండా చేసుకొను విధానమును నీకే చెప్పాడు. నీవు దేవుడు చెప్పినదానిని తెలియగలిగి దేవుని జ్ఞానమును గ్రహించగలిగితే, దేవుని జ్ఞానము ప్రకారము నడువ గలిగితే నీది ఎంత పెద్ద పాపమయినా తన జ్ఞానాగ్నిలో కాలిపోతుందని తెలియజేశాడు. నీవు నీ జీవితములో దేవునికి వ్యతిరేఖమయిన పనిని ఒక్కదానిని కూడా చేయలేదు. సమయము దొరికింటే చేసేవాడివో ఏమో గానీ, నీకు ఇతర మనుషులను మోసము చేయడమునకే కాలమంతా సరిపోయినది. దేవుడంటే భయము ఉండుట వలన నీకు మేము హితము చెప్పుచున్నాము. మా హితము వలన నీవు బాగుపడగలవని అనుకుంటున్నాను. పూర్వము హర్షకుడుగా యున్న రైతు నేడు ప్రపంచ విషయములలో మునిగిపోయి కర్షకునిగా మారడమేకాక పూర్తి కర్కషుడుగా మారిపోయాడు. కర్షకుడు కర్కషునిగా మారడము వలన రైతు జీవితములో ఏమాత్రము సుఖము లేకుండా పోయినది. అందువలన నేడు దేశములోని హర్షకులందరినీ కర్షకులుగా పిలుస్తున్నాము. కర్షకులు రైతులుగానే ఉండవలెనని కర్కషులుగా మారకూడదని చెప్పుచున్నాను. పూర్వమువలె రైతులలో సంతోషము ఉండవలెనంటే రైతులు పాపములకు దూరముగా ఉండవలెను. అప్పుడు

ప్రతి కర్షకుడు **'హర్షకుడు'**గా మారిపోగలడు. ఇప్పటి నుంచయినా నీవు పాపచింతన వదలి జీవితము చివరిలో దైవము మీద ధ్యాసను ఉంచుకో, ఇంతకంటే నీకు ఎక్కువ చెప్పలేము.

ఇట్లు

**ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**




పోలీస్ ఆఫీసర్‌కు,

జీవాత్మ స్వరూపులయిన నరసింహా చౌదరి గారికి వ్రాయు ఉత్తరము ఏమనగా!

నీకు ఇప్పుడు ముప్పై సంవత్సరముల వయస్సు వచ్చినది. నీకు దురదృష్టవశాత్తు పోలీస్ ఉద్యోగము వచ్చినది. పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగము అదృష్టము కొద్దీ వచ్చిందని నీవు అనుకొన్నావు. నేను దురదృష్టము చేత వచ్చినదని అంటున్నాను. రెండు సంవత్సరముల క్రిందట ఒకడు నా వద్దకు వచ్చి "నాకు పోలీస్ ఉద్యోగము వచ్చింది" అని చెప్పాడు. అప్పుడు నేను "నీవు బ్రతికేదానికే కదా! పోలీస్ ఉద్యోగము చేయాలను కొంటున్నావు. దానిని చేయుటకంటే బీడీల అంగడి పెట్టుకో ఆదాయము తక్కువయినా బ్రతుకగలవు" అని అన్నాను. అలా చెప్పుటకు కారణము గలదు. పోలీస్ ఉద్యోగము చేస్తే డబ్బులు ఎక్కువ వస్తాయి, సుఖముగా బ్రతుకవచ్చును. అయితే బీడీల అంగడి వలన డబ్బులు తక్కువ వస్తాయి అయినా కొద్దిపాటి సవరణలతో బ్రతుకవచ్చును. పోలీస్ ఉద్యోగములో డబ్బులు వచ్చినా డబ్బుల కంటే నాలుగింతలు పాపము వచ్చును. ఆ పాపము తర్వాత

జన్మలలో దుర్భర జీవితమును గడుపునట్లు చేయును. ఒక జన్మలో డబ్బులు వచ్చే పోలీస్ ఉద్యోగము చేసి, ఈ ఒక్క జన్మలో వచ్చిన పాపమును నాలుగు జన్మల జీవితములో అనుభవించ వలసియుండును. అదే బీడీల అంగడి వలన పెద్ద పాపము ఏమీ రాదు. అందులో దినమంతా పని చేసినా పాపము వచ్చే అవకాశమే ఉండదు. పోలీస్ ఉద్యోగములో ఒక రోజు పని చేసినా నాలుగు రోజులు అనుభవించే పాపము వచ్చుటకు అవకాశము గలదు. అందువలన నీవు పోలీస్ ఆఫీసర్‌గా పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గా పని చేయడము నీ దురదృష్టము అని చెప్పాను. బాగా ఆలోచించి చూస్తే, నా మాట నిజమని నీకే తెలియగలదు.

ఉద్యోగములు అనేక రకములుగా ఉన్నాయి. ఒకడు మునిసి పాలిటీలో ఉద్యోగము చేస్తుండగా, ఇంకొకడు బస్‌డిపోలో బస్‌డ్రైవర్ ఉద్యోగము చేయుచుండును. ఇట్లు ఎన్నో రంగములలోని పనులను ఉద్యోగము అని అంటున్నాము. పని చేయు డిపార్ట్‌మెంట్స్ వేరయినా, చేయు పనులు చిన్నవయినా, పెద్దవయినా చేయు పనిని ఉద్యోగము అనియూ చేయువానిని 'ఉద్యోగి' అనియూ చెప్పుచుందురు. "ఉద్యోగము" అను పదము పూర్వము కృతయుగములోనే యుండెడిది. అప్పటినుండి ఉద్యోగము అను పదము మారకుండా ఇప్పటివరకు అలాగే నిలిచియున్నది. 'ఉద్యోగము' అను పదమునుండి 'ఉద్యోగి' అను పదము వచ్చినది. ఉద్యోగము చేయువాడు ఉద్యోగి అని చెప్పవచ్చును. ఉద్యోగము చేయువాడు ఉద్యోగి అయినప్పుడు ఏ పనినీ చేయని వానిని "నిరుద్యోగి" అని అనెడివారు. 'ఉద్యోగి' అను పేరు పూర్వము ఎలా వచ్చింది అంటే దానికి ఒక కారణము గలదు. కృతయుగములో ఇప్పుడున్నట్లు మోటారు డిపార్ట్‌మెంటుగానీ, రైల్వే డిపార్ట్‌మెంట్‌గానీ, విద్యుత్తు డిపార్ట్ మెంట్‌గానీ, విద్యా డిపార్ట్‌మెంట్‌గానీ

మొదలగు ఏ డిపార్ట్‌మెంట్‌లు లేవు. అప్పటికాలములో రాజుక్రింద మంత్రిగానో, సైన్యాధిపతిగానో, సైనికులు గానో పనిచేయడమే ఉండేది. రాజుయున్నా రాజుక్రింద మంత్రి ఒకడే యుండేవాడు. ఇప్పటివలె అనేక మంత్రులు ఉండేవారు కాదు. మంత్రి తర్వాత సైన్యాధ్యక్షుడు ఒకడే యుండెడివాడు అతనిని సేనాధిపతి అని చెప్పెడి వారు. రాజు, మంత్రి, సేనాధిపతి తర్వాత సైనికులు వేలలో యుండేవారు. చక్రవర్తి దగ్గర అయితే సైనికులు లక్షలలో యుండేవారు. పూర్వము ఈ విధముగా నాలుగు రకముల ఉద్యోగములు మాత్రమే ఉండేవి.

చక్రవర్తి క్రింద రాజు కూడా ఒక ఉద్యోగిగా పని చేసెడివాడు. నాలుగు రకముల ఉద్యోగములు తప్ప ఏ ఉద్యోగము ఉండేది కాదు. ఉద్యోగము అనుమాటను విడదీసి చూస్తే ఉద్+యోగము=ఉద్యోగము. "ఉద్" అనగా పైన అనియూ, ఉన్నతమనియూ, గొప్ప అనియూ చెప్పవచ్చును. గొప్ప, పెద్ద, పైన అని **"దైవము"**ను చెప్పుచుందుము. **"యోగము"** అనగా కలయిక అనియూ, చేరిపోవడము అనియూ చెప్పవచ్చును. **దేవునియందు చేరిపోవడమునుగానీ, దేవునిలోనికి కలిసి పోవడమునుగానీ ఉద్యోగము అని చెప్పవచ్చును.** ఉద్యోగము యొక్క మూల అర్థము దేవునిలోనికి ఐక్యము కావడము అనియూ, లేక మోక్షము పొందడము అనియూ చెప్పవచ్చును. పూర్వము రాజుగా, మంత్రిగా, సైన్యాధిపతిగా, సైనికునిగా చేయు నాలుగు రకముల పనులను వారు ఉద్యోగములుగా భావించి చేసెడివారు. వారు చేయు పనిలో సచ్ఛీలత, సత్ప్రవర్తన ఉండేది. వారు చేయు పనిలో దుష్ప్రవర్తన ఏదీ ఉండేది కాదు. వారు చేయు పనులలో జ్ఞానముతో కూడుకొన్న ప్రవర్తన యుండేది. వారు చేయు పని ఏదయినా దేవునికి సన్నిహితముగా, దగ్గరగా తీసుకొని పోవునదిగా యుండెడిది. అలా

ఉండుట వలననే వారు చేయు పనిని "ఉద్యోగము" అని అన్నారు. ఆ మాటకు తగినట్లు వారి పనులు ఇతరులను బాధించక ఎంతో సౌమ్యముగా యుంటూ దేవునివద్దకు చేర్చేలాగ యుండేవి. అదియే 'ఉద్యోగము'.

ఆ దినములలో ఉద్యోగము అనగా ఎంతో **'పవిత్రత'**తో చేయునదని తలచెడివారు. నేడు ఎన్నో డిపార్ట్‌మెంట్‌లు పెరిగిపోయాయి. అనేక రకముల పనులతో కూడుకొన్న ఉద్యోగములు వచ్చినవి. అయితే ఏ ఉద్యోగములోనూ పవిత్రత లేదు. వారు చేయునవి పనులేగానీ, ఉద్యోగములు కావని చెప్పవచ్చును. కర్మకు అతీతముగా యుండునది, కర్మను అంటనిది ఉద్యోగము. అయితే నేడు మనుషులు చేయు పనులన్నీ పాపమును సంపాదించి పెట్టునవి, పాపముతో కూడుకొన్నవియై ఉన్నవి. అందువలన ఆ పనులను 'ఉద్యోగము' అని అనకూడదు. వారు ఉద్యోగము చేయు ఉద్యోగులు కారు. **"యోగి"** అంటేనే గొప్పవాడను భావము గలదు. 'ఉద్యోగి' అంటే ఎంతో గొప్పవాడు, ఉన్నతమైన భావము గలవాడని, ఉన్నత యోగమును ఆచరించువాడని చెప్పవచ్చును. నేడు నీవు పోలీస్ వ్యవస్థలో ఇన్‌స్పెక్టర్‌గా పనిచేయుచున్నావు కదా! నీ పని ఏమయినా ఉన్నతమైన యోగముగా యున్నదా? నీవు ఉద్ యోగిగా యున్నావా? నీవు చేయు పని యోగము యొక్క దరిదాపులలో కూడా లేదని చెప్పవచ్చును.

నీవు బ్రతుకుతెరువు కొరకు పోలీస్ వ్యవస్థలో చేరావు. చేరిన తర్వాత 'నేను ఒక మనిషిని' అని మరచిపోయావు. నేను పోలీస్ ఇన్‌స్పెక్టర్‌ని అనుకొన్నావు. అప్పటినుండి మనుషులందరు నీకంటికి మరొక విధముగా కనిపించను మొదలుపెట్టారు. నీ క్రింద కొందరు పోలీస్‌లు పనిచేయుట వలన మనుషులకంటే పోలీస్ పెద్ద, పోలీస్‌లకంటే నేను పెద్ద అను నీ భావము నిన్ను మనిషిగా మరచిపోవునట్లు చేసినది. మనుషులే

పశువులుగా కనిపించునప్పుడు దేవుడు నీకు లెక్కలేదు. దేవుని మీద భక్తిగానీ, భయముగానీ నీకు ఏమాత్రము లేదు. దేవుడని చెప్పేవారందరూ మోసగాళ్ళ మాదిరి, దైవభక్తులందరూ తెలివి తక్కువ వారిగా నీకు కనిపించెడివారు. సాధారణ మనుషులనే ఏమాత్రము లెక్కచేయక, సాటిమనిషిగా చూడకుండా తక్కువ చేసి నీచముగా మాట్లాడే నీవు భక్తి, జ్ఞానము అను వారిని ఇంకా హీనముగా చూడు స్వభావము నీకున్నది. నీ తలలోని ఆరు చెడు గుణములలో మొదటిదయిన 'ఆశ', చివరిదయిన 'అసూయ' ఎక్కువగా యుండేవి. వాటితో ధీటుగా 'గర్వము' కూడా యుండుట వలన నీవు చేయునవి పాపమును తెచ్చు పనులే అయినవి. నీవు ఎంత మంచివాడవో ఎంత చెడువాడవో నీకే తెలియునట్లు నీ జీవితములో జరిగిన కొన్ని సంఘటనలను నీవు చూచుకో తెలుస్తుంది. నీవు కులములో కూడా గర్వమును ప్రదర్శించుట వలన నీ కులస్థులను కూడా హీనముగా మాట్లాడే వానివి. ఎందరో నీ కులస్థులు కూడా నిన్ను ఏవగించుకొన్నారు, అయినా నీ బుద్ధి కొద్దిగా కూడా మారలేదు. నీయంతకు నీవు మంచివానిగా, నీయంతకు నీవు గొప్పవానిగా అనుకొన్నంత మాత్రమున నీవు మంచివానివి కావు, గొప్పవానివి కావు. నీ అధికారము నిన్ను కళ్ళు మూసుకొనిపోవునట్లు చేసినది. నీవు చేసే పని చిన్నదేయని నీకంటే గొప్ప అధికారులు కూడా ఎంతో సౌమ్యముగా యున్నారని మరచిపోయావు.

"నాకు లేఖ వ్రాయుటకు నీవు ఎవరు?" అని నన్ను నీవు ప్రశ్నించ వచ్చును. నీలాంటి వారు ఇలాగే అడుగుతారని నాకు తెలుసు. నేను స్వయముగా ఈ లేఖను వ్రాయలేదు. నిన్ను పుట్టించిన దేవుడే నన్ను ప్రేరేపించి ఈ లేఖను వ్రాయించుచున్నాడు. నిన్ను పుట్టించినవాడు నిన్ను దండించగలడు. అందుకే నీ తప్పులన్నీ బయటపెట్టుచూ వ్రాయుచున్నాడు.

ఇప్పటికయినా కనువిప్పు కలిగితే ఫరవాలేదు లేకపోతే నిన్ను రక్షించువాడు విశ్వములో ఎవడూ లేడు. మీ కుటుంబములో మీ అమ్మ, నాన్న, నీవు, నీ తమ్ముడు నలుగురు మాత్రమే ఉండేడివారు. మొదట మీ నాన్న ఇతరుల చేత చంపబడ్డాడు, తర్వాత నీ తమ్ముడు చంపబడ్డాడు. ఆ తర్వాత కొంత కాలమునకు మీ అమ్మగారు కూడా చంపబడ్డారు. మీ కుటుంబములో నీవు ఒక్కనివి మిగిలియున్నావు. మీ కుటుంబములోని చావుల వెనుక ఎవరూ శత్రువులు లేరు. మిమ్ములను మీరే చంపుకోవడము విశేషము. మొదట మీ నాన్నగారిని ఆయన తమ్ముల్లు చంపారు. కామెర్ల రోగికి మాంసము పెట్టితే అది విషముగా పనిచేసి చంపునని తెలిసి మీ నాన్న కామెర్ల రోగముతో యున్నప్పుడు మీ చిన్నాన్నగారు మాంసమును ఆహారముగా ఇచ్చారు. దానిని తినిన మూడు రోజులకే మీ నాన్న చనిపోయాడు. అది మర్డరే (హత్యే) అయినా దానిని హత్య అని ఎవరూ అనే దానికే వీలులేదు. అలాగే కొంతకాలమునకు నీ తమ్మున్ని ఆయన భార్యయే తాగే మందులో విషము పెట్టి చంపించినది. అది కూడా హత్యే అయినా దానిని ఆత్మహత్యగా చిత్రించారు, హత్యయని ఎవరికీ తెలియదు. కొంతకాలానికి మీ అమ్మ కూడా చంపబడినది. మీ నాన్నను, నీ తమ్మున్ని అయినవారు, దగ్గరవారు చంపివేయగా మీ అమ్మను కూడా గొంతు పిసికి చంపి పాముకాటుతో చనిపోయిందని చెప్పారు. మీ అమ్మను స్వయముగా నీవే చంపి ఎవరికీ తెలియకుండా చేసి పాము కరచి చనిపోయిందని చెప్పావు. దానితో అమె కూడా చంపబడినదని ఎవరికీ తెలియకుండా పోయినది.

మీ కుటుంబములో నలుగురు వ్యక్తులుంటే ముగ్గురు అకాల మరణముగా చంపబడగా, నీవు ఒక్కనివి మిగిలావు. నీ చావు ఎలా వ్రాసి

పెట్టబడియున్నదో? నీవు పోలీస్ ఇన్‌స్పెక్టర్‌వు గావున నన్ను ఎవరూ ఏమీ చేయలేరని అనుకొనియుంటావు. ఎవరి కర్మ ఎలా యున్నదో ఎవరికీ తెలియదు. ఉన్న కర్మ తెలియదుగానీ, ఇప్పుడు క్రొత్తగా సంపాదించుకొను కర్మ బయటికి కనిపించునట్లున్నది. ప్రపంచ విషయములలో నీకు తెలియకుండానే ఎక్కువ పాపములను సంపాదించుకోగలిగావు. నీ స్వభావములో దేవుడు అన్నా, దేవుని జ్ఞానము అన్నా చాలా చౌకగా యుండుట వలన దైవమార్గములో కూడా అధికముగా పాపమును సంపాదించుకో గలిగావు. దైవమార్గములో అనగా దైవ విషయములో నీవు సంపాదించిన పాపమును గురించి చెప్పుచున్నాను బాగా గ్రహించు.

దేవుని జ్ఞానమును పుస్తక రూపములో ప్రచారము చేయువారు నీవు ఉద్యోగము చేయు ఊరిలో ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేయుచుండగా, వారిని పిలిచి దొంగలను తిట్టినట్లు తిట్టావు. కాషాయ గుడ్డలు ధరించి సన్న్యాసిగాయున్న వ్యక్తిని కూడా వదలకుండా కొట్టనుపోయావు. వారు పెద్ద ఆధ్యాత్మిక సంస్థనుండి వచ్చినవారనీ, వారు జ్ఞానమునే ప్రచారము చేయుచున్నారనీ నీకు ముందే తెలుసు. నీవు ఆశ్రమమున్న ఊరిలో పనిచేశావు. అందువలన వారు ఫలానావారని నీకు తెలుసు, అయినా ఊరిలో దొంగతనము చేయను ఊరంతా తిరిగి చూచుకొంటున్నారని, అదే పనిగా ఆరోపణ చేసి, వారిని రెండుగంటలసేపు స్టేషన్‌లో పెట్టుకొని మానసికముగా వేధించావు. నీ నోటికి వచ్చినట్లు దూషణగా మాట్లాడినావు. ఆ ఊరినుండి వెంటనే పొమ్మని చెప్పి పంపావు. గంటలోపు ఊరు వదలి పోకపోతే లాఠీలతో కొట్టుతానని బెదిరించి పంపావు. అక్కడ ప్రచార బాధ్యతలో వచ్చిన స్వామీజీ నీ కులము వాడేనని తెలుసు. ఆయన ఆఫీసర్ పదవినుండి రిటైర్డు అయిన తర్వాత సన్న్యాసత్వమును స్వీకరించి

దైవసేవ నిమిత్తము జ్ఞానప్రచారమును చేయుచున్నాడని తెలుసు. ఆ స్వామీజీకి వచ్చే పింఛను డబ్బులు నీ జీతముకంటే ఎక్కువని కూడా తెలుసు. అన్నీ తెలిసి వారిని దొంగలను దండించినట్లు దూషించి, ఒక సమయములో కొట్టేదానికి పోయి భయపడునట్లు చేసి పంపడమైనది. నీవు అలా చేయడము నీలోయున్న అసూయయే కారణమని చెప్పవచ్చును. అసూయతో పాటు నీలోని గర్వము కూడా నిన్ను అలా చేయించినది. నీవు ఉరవకొండ ప్రక్కన గ్రామములో ఉద్యోగము లేనప్పుడు ఉద్యోగము దొరికితే చాలని ఉద్యోగము కొరకు ప్రయత్నములు చేయగా, నీ కర్మకొద్దీ ఉద్యోగము దొరికినది. ఉద్యోగము వచ్చిన తర్వాత నీ కళ్ళు తలమీదికి పోయాయి.

సర్వ ప్రపంచములో అందరి వెనుకయుండి నడిపించు దైవము ఎడల ఏమాత్రము గౌరవము లేకుండాయుండడము, ప్రపంచమునకు అంతటికీ దేవుడు పెద్ద అని అనుకోకుండా నీకు నీవే పెద్ద అనుకోవడము, పెద్ద చిన్న అను తారతమ్యము లేకుండా అధికారము చేతిలోయున్నదని గొప్పవారిని సహితము, దైవజ్ఞానులను సహితము దూషించి మాట్లాడడము చేశావు. నన్ను ఎవరూ ఏమీ చేయలేరను ధీమా నీ ఉద్యోగము వలన నీకు వచ్చినది. నీవు చేయుచున్న ఉద్యోగము కొంతకాలముండునదేయని మరచిపోయావు. మీ కుటుంబములో అందరూ హత్యయే కావింపబడి నారు. నీకు కూడా అదే వ్రాతయుంటుంది. ఇప్పటికే నీవు జ్ఞానము ఎడల వ్యతిరేఖత, దేవుని ఎడల భయము లేకుండా ప్రవర్తించావు. నీ నడవడికను ఆకాశమునుండి భూతములు గ్రహించాయి. ఆకాశ భూతములు రోగముల రూపముగా పీడించగలవు. ప్రపంచ విషయములో నయినా నిరపరాధులను అపవాదులుగా చిత్రించి మాట్లాడితే వారిని క్యాన్సర్ భూతము

వదలదనీ, అది ప్రపంచ పాపమయినా తప్పక క్యాన్సర్ రూపములో అనుభవించవలెనని ముందే చెప్పియున్నాము. నీవు జ్ఞానులను, దైవ జ్ఞానమును నిందించడము, దొంగలవలె పోల్చి మాట్లాడడము జరిగినది. జ్ఞానమునకు, దైవమునకు నీవు పూర్తి వ్యతిరేఖముగా మాట్లాడడము జరిగినది. అందువలన నీవు క్షమించరాని పాపమును పొందగలిగావు.

పాపము అంటే అది ఇప్పుడు కనిపించునదికాదు. అనుభవించే టప్పుడు దాని బాధ ఎట్లుంటుందో తెలుస్తుంది. ఎందరో భూమిమీద పాపమును రోగముల రూపములోగానీ, కష్టముల రూపములోగానీ, బాధల రూపములో గానీ అనుభవిస్తూనే యున్నారు. అయినా ఆ బాధలు, ఆ కష్టములు, ఆ రోగములు స్వయానా వారు చేసుకొన్న పాపముల వలన వచ్చినవేయని చాలామందికి తెలియదు. కొంత జ్ఞానము తెలిసిన వారికి మాత్రము పాపము వలననే కష్టములు, రోగములు, బాధలు వస్తున్నవని అర్థమగుచున్నది. అలా అర్థమగుట వలన వారు ఆ బాధలకు పరిష్కార మార్గమైన దైవజ్ఞానమును ఆశ్రయించి దైవముయొక్క క్షమాశీలతను పొందవచ్చును. అనుభవించే బాధగానీ, రోగముగానీ దేనివలన వచ్చినదో, దానికి కారణమేమిటో తెలియకపోతే, అటువంటి వాడు పాపము యొక్క క్షమాశీలతను పొందే అవకాశమే యుండదు. నేడు ప్రపంచ సంబంధమైన పాపములను అనుభవించువారు, వారు అనుభవించు బాధలకు, రోగము లకు, కష్టములకు కారణము తెలియకపోవడము వలన, వారు చేసుకొన్న పాపములే బాధల, వ్యాధుల రూపములలో బాధించుచున్నవని తెలియక పోవడము వలన, అట్టివారు దానికి పరిష్కారమైన జ్ఞానమును ఆశ్రయించరు. పాప నిర్మూలన చేసుకోలేరు. అందువలన వారు చేసుకొన్న పాపము నంతటినీ అనుభవించుచున్నారు. ప్రపంచ పాపమునుండి బయటపడు

అవకాశమున్నా, వానికి ఆ విధానము అర్థముకాక, తప్పక అనుభవింపవలసి వచ్చును. ఇదంతయూ ప్రపంచ సంబంధ పాపముల యెడల యున్న విధానముకాగా, దైవసంబంధ పాపముల యెడల ఉన్న విధానము అనుభవించడము తప్ప తప్పించుకొనుటయే లేదు.

దైవ సంబంధమైన పాపమును, నీలాంటి పొగరుపట్టిన వారు, దేవుడంటే భయము లేనివారు, జ్ఞానమంటే గౌరవములేని వారు పొందు చుందురు. నీవు ఎప్పుడయితే దైవజ్ఞానమును ఆటంకపరచి, ప్రచారము చేయువారిని హీనముగా దూషించి పంపావో, ఆ దినమే దైవమునకు వ్యతిరేఖముగా నమోదయిన పాపము నిన్ను చేరినది. అనగా క్షమించ రాని పాపమును నీవు పొందావని చెప్పుచున్నాము. అన్నీ తెలిసి అనవసరముగా జ్ఞానమును, జ్ఞానులను అగౌరవముగా మాట్లాడినందుకు, దూషించి మాట్లాడినందుకు 'దైవద్రోహ' పాపము నిన్ను చేరినది. దైవ దూషణకు కారణముగా వచ్చిన పాపమును తప్పక అనుభవించ వలెనని ముందే చెప్పియున్నాము. దానినే 'క్షమించరాని పాపము' అనికూడా అంటున్నాము. క్షమించరాని పాపము జ్ఞానము వలన క్షమించబడదు. దేవుడు కూడా తనకు వ్యతిరేఖముగా సంపాదించుకొన్న వాని కర్మను క్షమించడు. అటువంటి కర్మ ఒకరోజు చేసుకున్నదయినా, అది ఒక రోజుతో అయిపోదు. దైవ వ్యతిరేఖ కర్మ ఒక నిమిషము చేసుకొన్నదయినా రెండు యుగముల వరకు నిత్యము అనుభవించ వలసియుండును. అటువంటి భయంకరమైన దైవద్రోహ పాపము, దైవజ్ఞాన వ్యతిరేఖ పాపమును నీవు ఒకమారు సంపాదించుకోలేదు. నీ జీవితములో పదిమార్లు అటువంటి క్షమాశీలత లేని పాపమును సంపాదించుకొన్నావు. దీనినే వివరముగా చెప్పితే ఇరవై యుగముల వరకు అనగా కొన్ని లక్షల సంవత్సరముల

వరకు పాపమును నిత్యము అనుభవించవలసి యుండును. అంత పాపమును "నీవు జ్ఞానము" అనినా, "జ్ఞానులు" అనినా భయము లేకుండా యుండుట వలన వారికి, వారి జ్ఞానమునకు వ్యతిరేఖముగా ప్రవర్తించుట వలన చేసుకొన్నదని చెప్పుచున్నాము. నీవు పదిమార్లు దైవదూషణ చేసి సంపాదించుకొన్న పాపము కొన్ని గంటలలోనిదే. ఆ కొన్ని గంటల పాపము లక్షల సంవత్సరముల పాప అనుభవమునకు కారణమైనది. నీవు ఇప్పుడు దేవున్ని వేడుకొనినా దేవుడు కూడా నిన్ను ఏమీ చేయలేడు. అందరి పాపములను క్షమించు దేవుడు నీ పాపమును ఏమాత్రము క్షమించడు. క్షమించక పోవడమేకాక దైవదూషణ పాపము అయిపోవు వరకు అనగా ఇరవై (20) యుగముల వరకు నీకు జ్ఞానము యొక్క గట్టు దొరకకుండా చేయును. కావున ఎవరు చెప్పినా, ఎంత చెప్పినా నీ బుద్ధికి దైవజ్ఞానము ఏమాత్రము అర్థముకాదు. ఇరవై యుగముల పర్యంతము నీకు దైవజ్ఞానము అర్థముకాదనీ, జ్ఞానమునకు దూరముగా యుండవలసినదేనని చెప్పు చున్నాను.

నీకు లేఖ రూపములో ఉత్తరమును వ్రాసినా ప్రయోజనము లేదని నాకు తెలుసు. నీలో ఏ మార్పు రాకుండుటకు దేవుని జ్ఞానమునకు దూరముగా యుండుటకు దేవుడే నిర్ణయించాడని తెలిసి ఉత్తరము వ్రాశాను. నా ఉత్తరము వలన నీకు ఏమీ ప్రయోజనము లేదుగానీ ఈ ఉత్తరమును చదివిన మిగతా ప్రజలు పాపము యెడల జాగ్రత్త పడగలరని అనుకుంటున్నాను. నీవు ఈ జన్మలో ఎంతకాలముంటావో అంతకాలము నీకు నిర్ణయింపబడిన ప్రారబ్ధకర్మ ప్రకారము జరుగును. నీ మరణము తర్వాత వచ్చు జన్మ పాపభూయిష్టమైనదై యుండును. ఇరవై యుగముల వరకు దేవుని శాపము నీ మీద ఉంటుంది. నీ ఉద్యోగమును చూచుకొని

ఏమాత్రము పెద్ద చిన్న లేకుండా ప్రవర్తించినందుకు వచ్చిన పాపమును అనుభవించ వలసి యుంటుందని ఇప్పటికయినా తెలుసుకో, కొద్దిపాటి నీ జీవితములో ఇంకొకమారు దైవవ్యతిరేఖ కార్యములు చేయవద్దు, జ్ఞానులను అవమాన పరచవద్దు. నా బుద్ధి ఎందుకు పోతుందని నీవు అట్లే చేస్తే దేవుడు నిన్ను వదలడు. మరొక్కమారు క్షమించని పాపమును అంటగట్టును. ఇంతకంటే నీకు ఎక్కువ చెప్పడము అనవసరము.

ఇట్లు

**ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**



ఇంతవరకు ఐదు రకముల మనుషులకు వారు చేసిన పనులను, వారు సంపాదించుకొన్న కర్మలను గురించి చెప్పాము. వారి పాపములను చెప్పడమేకాక, కొందరిలో నా ఉత్తరము ద్వారా మార్పు తెచ్చుకోమని చెప్పాను. నా ఉత్తరము వలన కొందరయినా బాగుపడు వారుండవచ్చును. నేను వ్రాసిన ఐదు లేఖలలో ఒక మనిషి అయినా మార్పు చెంది జ్ఞానముమీద ఆసక్తి కలవాడు కావలెనని నేను అనుకొంటున్నాను. కొందరిలో మార్పురాదని తెలుసు. అయితే వారి కొరకు వ్రాయవలసిన పనిలేదు. మారగల వారికే ఈ లేఖలనీ, వారినే లేఖలు మార్పు తెచ్చి మంచిమార్గములో ప్రయాణించు నట్లు చేయునని చెప్పుచున్నాము. మనిషిలో గుణములే మనిషిని నడుపు చుక్కాని లాంటివి. ఆ గుణముల ప్రభావముతోనే మనిషి తన భావమును వ్యక్తము చేయుచున్నాడు. మనిషి వ్యక్తము చేయు మాటలనుబట్టి, మాటలలోని భావమును తెలియవచ్చును. నా అనుభవములో యున్న ఒక సంఘటనను చెప్పుతాను వినండి. నాకు 1994వ సంవత్సరము నుండి గన్‌లైసెన్సు ఉంది. లైసెన్స్‌కు రెన్యువల్

కొరకు పంపినప్పుడు గన్‌నుండి రివాల్వర్‌కు మార్చుకోవడము జరిగినది. అప్పుడు తప్పనిసరిగా పోలీస్ స్టేషన్‌కు పోవలసి వచ్చినది.

నేను ఎక్కడికి పోయినా సర్వసాధారణ మనుషులున్నట్లే యుంటాను. నావద్ద నేను స్వామీజీనన్నట్లు ఏ ఆధారము ఉండదు. సాధారణముగా పోయిన నన్ను చూచి అక్కడ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేయుచున్న వ్యక్తి నాతో మాట్లాడడము జరిగినది. అతను మాట్లాడే విధానము ఎదుటి మనిషిని ఏమాత్రము గౌరవములేని విధముగా కనిపించినది. మీరు స్వాములయితే మీకు గన్‌తో పనేమున్నది? అని అడిగాడు. దానికి జవాబుగా నేను ఇట్లు చెప్పడమైనది. "నేను ఎంతస్వామినయినా ఒక సాధారణ మనిషినే. మనిషికంటే గొప్పవారు దేవతలని అందరూ అనుచుందురు గదా! దేవతలలో పెద్ద దేవతలయిన విష్ణువుకు, శివునకు, మిగతా చిన్న దేవతలయిన ప్రతి వారి చేతిలో ఆయుధములున్నవి కదా! వారు దేవతలయినప్పుడు ఆయుధము లెందుకు? నేను మనిషిని కాబట్టి నా భయముతో స్వయం రక్షణకు నేను ఒక్క ఆయుధమునే ఉంచుకొన్నాను. దేవతలయినవారు ఒక్క ఆయుధముతో ఉండక ఒక్కొక్కరు రెండు, నాలుగు, ఆరు ఆయుధములు కల్గియున్నట్లు చూస్తూనేయున్నాము కదా! అందరినీ రక్షించు దేవతలే అన్ని ఆయుధములు కలిగియున్నప్పుడు, నేను ఒక ఆయుధము కల్గియుండడములో తప్పులేదు కదా!" అన్నాను.

నా వద్దకు ఎందరో భక్తులు వస్తూయుంటారు. నెలకు కొన్ని వేల మంది వచ్చినా వారికి నా దర్శనము కలుగదు. నేను కలిసి మాట్లాడడము కూడా జరుగదు. ఎందరో నాతో మాట్లాడవలెననీ, నా దర్శనము కావాలనీ కొన్ని నెలలుగా కాచుకొనియున్నారు. అయినా వారికి కనిపించని వానిని అవసరముండి నాగొప్పతనము ఏమీ కనిపించకుండా సాధారణ వ్యక్తిగా

నేను అక్కడికి పోతే, ఎదుటి మనిషిని గౌరవముగా మాట్లాడకపోయినా ఫరవాలేదుగానీ, కించపరిచే విధముగా మాట్లాడకూడదని వారికి తెలియ కుండా పోయినది. 65 సంవత్సరముల వయస్సున్న నన్నే అగౌరవముగా మాట్లాడినవారు సామాన్య ప్రజానీకమువద్ద వీరి ప్రవర్తన ఎలాగుంటుందో ఆలోచించవచ్చును. అందుకే గౌరవముగా బ్రతుకువారు పోలీస్‌స్టేషన్‌లకు పోవాలంటే ఇష్టపడరు. 20 సంవత్సరములనుండి నావద్ద గన్‌లైసెన్స్ ఉన్నప్పుడు ఇప్పుడు క్రొత్తగా మీకేమి పని అని అడుగవలసిన అవసర మేమిటి? అంతేకాక ఆరు నెలలకొకమారు చెకప్‌కు తీసుక రావలెనని చెప్పడము, అట్లు రాకపోతే నేనే మీ ఇంటికివచ్చి చెక్ చేస్తానని చెప్పడము చూస్తే ఒక క్రిమినల్‌తో మాట్లాడినట్లు మాట్లాడుచున్నాడని పిస్తుంది. ఇదంతా చూచిన తర్వాత వీరికి పైనున్న ఆఫీసర్‌లు సంస్కారము నేర్పితే సాధారణ ప్రజలకు పోలీసుల భయము పోతుంది. ఏ సమాచారము నయినా స్టేషన్‌కు పోయి చెప్పగలరు.

ఉద్యోగస్తులు పైకి ఎదిగే పని చేయడములేదుగానీ, క్రిందికి దిగ జారిపోయే పనిని చేస్తున్నారు. కొందరికి తమ ఉద్యోగ హోదా తలబిరుసు తనానికి కారణమగుచున్నది. ప్రజలను బెదిరించి, పీడించి డబ్బులు లాగు కొంటున్నారు. ప్రతి ఉద్యోగి తన **'ఉద్యోగము'** అను పదమునకు తగినట్లు నడుచుకోక, తాను కూడా సమాజములో మనిషినేనని మరచిపోకూడదు. నేడు ప్రతిచోట ప్రతి ఉద్యోగి అక్రమముగా నడుచుకోవడము వలన, అతడు చేయునది పాపమేనని వారికి తెలియకుండా పోయినది. తెలియని తప్పులను తెలుపువారు ఎవరూ లేని దానివలన సమాజములో ఉద్యోగ వ్యవస్థ అథోగతి పట్టిపోయినది. దానివలన ప్రతిచోట పాపము నమోదవు చున్నది. ప్రతి ఉద్యోగి తనకు వచ్చు కనిపించే డబ్బును చూచుకొంటున్నాడు తప్ప, తనకు కనిపించకుండా వచ్చు పాపమును చూడడము లేదు. పాపము

వచ్చునను విషయమే తెలియకుండా బ్రతుకుచున్నాడు. దానివలన పాపభీతి ఏమాత్రము లేకుండా పోయినది. పాపము వచ్చుననీ, దానివలన రోగములు గానో, కష్టములుగానో, శరీరములోని బాధలుగానో శిక్షలు తప్పవని తెలియకుండా పోయినది. అందువలన పాపముయొక్క భయము కల్గులాగున, పాప భయముండునట్లు ప్రతి మనిషి సక్రమముగా నడుచు కొనులాగున చేయవలెనను ఉద్దేశ్యముతో మేము ఈ విధముగా వ్రాయవలసి వచ్చినది. **“బుద్ధి చెప్పువాడు గ్రుద్ది చెప్పవలసియుంటుందను”** పెద్దలమాట ప్రకారము నేను కొందరికి వ్యతిరేఖముగా మాట్లాడినట్లు కనిపించినా, నేను మాట్లాడునది, వ్రాయునదంతా వారి మేలుకొరకేయని చెప్పుచున్నాను. నేను సత్యమును చెప్పుట వలన కొందరికి నేను చేదుగా కనిపించగలనని నాకు తెలుసు. ఇలా చెప్పడము వలన నాకు లాభము ఏమీలేదు. అయినా సమాజ శ్రేయస్సు కొరకు, సమాజములోని ప్రతి మనిషి దేవుడు అను జ్ఞప్తి కలిగి దైవజ్ఞానమువైపు నడుచుటకు, ఇది దేవుని సేవగా తలచి చెప్పు చున్నాము తప్ప ఇందులో నా ఉద్దేశ్యము ఏమీ లేదు.

ఇందులో లేఖలు చెప్పిన వ్యక్తులు గానీ, లేఖలలోని సమాచారము గానీ, అంతయూ కల్పితమే తప్ప ఎవరినో ఉద్దేశించి వ్రాసినవి కావు. దైవజ్ఞాన నిమిత్తము వ్రాసిన లేఖలే తప్ప, ఎవరినీ కించపరచుటకు వ్రాయలేదని తెలియజేయుచున్నాము.

ఇట్లు

**ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# నీకు నా లేఖ




త్రిమత ఏకైక గురువు

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org